బాలానంద బొమ్మల

# శ్రీ వేంకటేశ్వర లీలలు






రేవళ్ళ సూర్యనారాయణమూర్తి



నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

బాలానంద బొమ్మల శ్రీ వేంకటేశ్వర లీలలు

రచన :
రేవళ్ళ సూర్యనారాయణమూర్తి



ప్రచురణ హక్కులు :
బి.కె.ఆర్. మూర్తి
విజయవాడ-2
ఫోన్ : 62813

ముద్రణ :
సెప్టెంబర్-1994

ముఖచిత్రం, లోపలి బొమ్మలు :
శ్రీబాలి పైడిరాజు

ముద్రణ :
బాలాజీ ప్రింటింగ్ ప్రెస్
విజయవాడ-4

వెల : రు. **15-00**

## తొలిపలుకు

"కలియుగ ప్రత్యక్ష దైవము."

"పిలిచిన పలికెడు దేవుడు."

"భక్తుల పాలిటి కొంగు బంగారము."

అని పేరు పొందిన దేవుడు తిరుపతి శ్రీ వేంకటేశ్వరుడు. శ్రీ వేంకటేశ్వరుడు హిందువుల అభిమాన దైవము. అయినను ఇతర మతములవారు, విదేశీయులు కూడా అనేక మంది ఆయనను దర్శించుటకు పోవుచుందురు.

శ్రీ వేంకటేశ్వరుడు "శ్రీనివాసుడు", "బాలాజీ" మొదలగు పేర్లు కలిగి భక్తులచే పూజింపబడుచున్నాడు. ఆయన మన దేశ ప్రజలతో మాత్రమే గాక ఇతర దేశ ప్రజలతో కూడ ఆరాధింప బడుచున్నాడు. అనేక ప్రపంచ ప్రసిద్ధి గల నగరములలో ఆయన దేవాలయములు నెలకొల్పబడి అచ్చటి ప్రజలచే శ్రీ వేంకటేశ్వరస్వామి సేవింపబడుచున్నాడు.

ఇంతగా ప్రపంచ ప్రసిద్ధి పొందిన శ్రీ వేంకటేశ్వర స్వామి ఎవరో, ఆయన చరిత్ర యెట్టిదో, మహిమ లెట్టివో తెలిసికొనుటకు భక్తులు—ముఖ్యంగా బాల బాలికలు కుతూహల పడుచుందురు.

అట్టి భక్తుల నలరింపజేయు తలంపుతో, సామాన్య చదువరులగు స్త్రీ పురుషులు, బాల బాలికలు సహితము చక్కగా అర్థము చేసికొనుటకు వీలగునట్లు తేట తెలుగు భాషలో ఈ గ్రంథము రచించితిని.

కావున బాల బాలికలు, సామాన్య చదువరులు ఈ గ్రంథమును చదివి, శ్రీ వేంకటేశ్వర స్వామి దివ్య చరిత్రమును తెలిసికొని తరింతురు గాక!

...రేవళ్ళ సూర్యనారాయణమూర్తి

# లోపలి పేజీలలో



# శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

* కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥

* ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ।
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళం కురు ॥

* మాతస్సమస్త జగతాం మధుకైటభారేః
వక్షో విహారిణి మనోహర దివ్యమూర్తే ।
శ్రీ స్వామి నిశ్రిత జనప్రియ దానశీలే
శ్రీ వేంకటేశ దయితే తవ సుప్రభాతమ్ ॥

* తవ సుప్రభాత మరవిందలోచనే
భవతు ప్రసన్న ముఖ చంద్రమండలే।
విధి శంకరేన్ద్ర వనితాభి రర్చితే
వృషశైలనాథ దయితే దయానిధే॥

* అత్ర్యాది సప్తఋషయ స్సము పాస్య సంధ్యాం
ఆకాశ సింధు కమలాని మనోహరాణి।
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రసన్నాః
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్॥

* పంచానన నాబ్జ భవషణ్ముఖ వాసవాద్యాః
త్రైవిక్రమాది చరితం విబుధాః స్తువంతి।
భాషాపతిః పఠతి వాసర శుద్ధి మారాత్
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్॥

* ఈషత్రపుల్ల సరసీరుహ నారికేళ
పూగద్రుమాది సుమనోహర పాళికానాం।
ఆవాతి మంద మనిలః సహదివ్యగంధైః
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ !!

* ఉన్మీల్య నేత్రయుగ ముత్తమ పంజరస్థాః
పాత్రావశిష్ట కదలీఫల పాయసాని।
భుక్త్వాసలీల మథకేళి శుకాః పఠంతి
శేషాద్రిశేఖర విభో తవ సుప్రభాతమ్॥

* తంత్రీ ప్రకర్ష మధుర స్వనయా విపంచ్యా
గాయత్ర్యనంత చరితం తవ నారదో౽పి ।
భాషా సమగ్ర మసకృత్కర చార రమ్యం
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥

* భృంగావళీచ మకరంద రసానువిద్ధ
ఝుంకార గీత నినదైః సహ సేవనాయ ।
నిర్యాత్యుపాంత సరసీ కమలోదరేభ్యః
శేషాద్రిశేఖర విభో తవ సుప్రభాతమ్ ॥

* యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధి మంథన తీవ్ర ఘోషాః ।
రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుంభాః
శేషాద్రి శేఖర విభో తవ సుప్రభాతమ్ ॥

* పద్మేశ మిత్ర శతపత్ర గతాళి వర్గాః
హర్తుం శ్రియం కువలయస్య నిజాంగ లక్ష్మ్యా ।
భేరీ నినాదమివ బిభ్రతి తీవ్రనాదం
శేషాద్రిశేఖర విభో తవ సుప్రభాతమ్ ॥

* శ్రీమన్నభీష్ట వరదాఖిల లోకబంధో
శ్రీ శ్రీనివాస జగదేక దయైక సింధో !
శ్రీ దేవతా గృహ భుజాంతర దివ్యమూర్తే
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* శ్రీ స్వామి పుష్కరిణికా ఽ ప్లవ నిర్మలాంగాః
శ్రేయో ఽ ర్థినో హరవిరించి సనందనాద్యాః ।
ద్వారే వసంతి వరవేత్ర హతోత్త మాంగాః
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* శ్రీ శేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రి ముఖ్యామ్ ।
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* సేవాపరాః శివసురేశ కృశానుధర్మ
రక్షోఽంబునాథ పవమాన ధనాధినాథాః ।
బద్ధాంజలి ప్రవిలసన్ని జశీర్ష దేశాః
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* ధాటీషు తే విహగరాజ మృగాధిరాజ
నాగాధిరాజ గజరాజ హయాధిరాజాః ।
స్వస్వాధికార మహిమాదిక మర్థయంతే
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* సూర్యేందు భౌమ బుధ వాక్పతి కావ్యసౌరి
స్వర్భాను కేతు దివిషత్పరిషత్ప్రధానాః ।
త్వద్దాసదాస చరమావధి దాసదాసాః
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* త్వత్పాద ధూళి భరిత స్ఫురితో త్తమాంగాః
స్వర్గాపవర్గ నిరపేక్ష నిజాంతరంగాః ।
కల్పాగమా కలనయా కులతాం లభంతే
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* త్వద్గోపురాగ్ర శిఖరాణి నిరీక్ష మాణాః
స్వర్గాపవర్గ పదవీం పరమాం శ్రయంతః ।
మర్త్యా మనుష్య భువనే మతిమాశ్రయన్తే
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* శ్రీ భూమినాయక దయాది గుణామృతాబ్ధే
దేవాది దేవ జగదేక శరణ్యమూర్తే ।
శ్రీ మన్ననంత గరుడాదిభి రర్చితాంఘ్రే
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* శ్రీ పద్మనాభ పురుషోత్తమ వాసుదేవ
వైకుంఠ మాధవ జనార్దనే చక్రపాణే ।
శ్రీవత్స చిహ్న శరణాగత పారిజాత
శ్రీ వేంకటా చలపతే తవ సుప్రభాతమ్ ॥

* కందర్ప దర్ప హరసుందర దివ్యమూర్తే
కాంతా కుచాంబురుహ కుట్మలలోల దృష్టే ।
కల్యాణ నిర్మల గుణాకర దివ్యకీర్తే
శ్రీ వేంకటా వలపతే తవ సుప్రభాతమ్ ॥

* మీనాకృతే కమఠ కోల నృసింహ వర్ణిన్
స్వామిన్ పరశ్వథ తపోధన రామచంద్ర ।
శేషాంశరామ యదునందన కల్కిరూప
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥

* ఏలా లవంగ ఘనసార సుగంధి తీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్ ।
ధృత్వాద్య వైదిక శిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే తవ సుప్రభాతమ్॥

* భాస్వానుదేతి వికచాని సరోరుహాణి
సంపూరయంతి నినదైః కకుభో విహంగాః ।
శ్రీ వైష్ణవా స్సతత మర్థిత మంగళా స్తే
ధామాశ్రయంతి తవ వేంకట సుప్రభాతమ్ ॥

* బ్రహ్మాదయస్సురవరా స్సమహర్షయ స్తే
సంతస్సనందన ముఖా స్త్వథ యోగివర్యాః ।
ధామాంతికే తవ హి మంగళ వస్తుహస్తాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥

* లక్ష్మీనివాస నిరవద్య గుణైక సింధో
సంసార సాగర సముత్తరణైక సేతో ।
వేదాంత వేద్య నిజవైభవ భక్తభోగ్య
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥

* ఇత్థం వృషాచలపతే రిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః ।
తేషాం ప్రభాత సమయే స్మృతిరంగ భాజాం
ప్రజ్ఞాం పరార్థ సులభాం పరమాం ప్రసూతే ॥

# శ్రీ వేంకటేశ్వర లీలలు

## తిరుమల పూర్వ చరిత్ర

కలియుగ వైకుంఠమని పేరుపొందిన దివ్యక్షేత్రము తిరుమల-తిరుపతి. ఇది శ్రీ వేంకటేశ్వరుడని పిలువబడుచున్న శ్రీనివాసుని నివాస స్థలము. ఈ క్షేత్రమునకు-శేషాద్రియని, వేదాచలమని, గరుడాచలమని, వృషభాద్రియని, అంజనాద్రియని, ఆనందాద్రియని, వేంకటాచలమనికూడ పేర్లు కలవు.

ఈ పర్వతము వేదములచే నిండియుండుటవలన "వేదాచలము" అను పేరు పొందినది.

## గరుడాచలము అను పేరుపొందిన విధము

చాలాకాలము క్రిందట బ్రహ్మదేవుడు నిద్రించుచున్న సమయమున హిరణ్యాక్షుడను రాక్షసుడు భూమిని చాపవలెచుట్టి రసాతలమునకు ఈడ్చుకొని పోయి హింసించసాగెను. కొంతకాలమునకు బ్రహ్మదేవుడు నిద్రనుండి మేల్కొని ఆ సంగతి తెలిసికొని విచారించెను. భూదేవికి కలిగిన కష్టము తొలగించమని విష్ణువును ప్రార్థించెను.

బ్రహ్మ ప్రార్థన విని విష్ణుదేవుడు శ్వేతవరాహ రూపముదాల్చి రసాతలమునకు పోయి హిరణ్యాక్షుని వధించి, భూమిని రక్షించి యథాస్థానమున నిలిపెను. బ్రహ్మను పిలిచి తిరిగి సృష్టి ప్రారంభించమని ఆజ్ఞాపించెను.

అప్పుడు బ్రహ్మాది దేవతలు వరాహ రూపమున నున్న విష్ణువును అనేక విధముల స్తుతించి కొంతకాలము భూలోకమున నివసించి భక్తులను



వరాహ రూపముదాల్చి హిరణ్యాక్షుని వధించి
భూదేవిని కాపాడుచున్న విష్ణుమూర్తి

కాపాడమని కోరినారు. విష్ణుదేవుడు వారి ప్రార్థన కంగీకరించి, తాను భూమిపై నివసించుటకు తగిన స్థలము లేనందున గరుత్మంతునితో వైకుంఠమున నున్న

క్రీడాద్రిని తెప్పించి దానిపై భూదేవి సహితముగ నివసించుచు భక్తులను రక్షించుచుండెను. ఆ క్రీడాద్రియే నేడు తిరుమల అని చెప్పుకొనబడుచున్న పర్వత రాజము. గరుత్మంతునిచే తేబడినదిగాన 'గరుడాచల' మనబడుచున్నది.

## వృషభాద్రి అను పేరుపొందిన విధము

పూర్వము వృషభాసురుడను రాక్షసుడు గరుడాచలముపై నివసించి నృసింహసాల గ్రామమును పూజించుచుండెను. అతడు ప్రతిదినము పూజ పూర్తి అయిన తరువాత ఖడ్గముతో తన తలను ఖండించి పుష్పములతో ఆ శిరస్సును సాల గ్రామమునకు సమర్పించుచుండెను. పూజ సంపూర్ణమైన తరువాత అతని శిరస్సు యథాపూర్వకముగ వచ్చుచుండెను. వృషభాసురుడిట్లు కొన్ని వేల సంవత్సరములు తపస్సు చేసెను.

కొంతకాలమునకు విష్ణుదేవుడు అతనిపై కరుణించి ప్రత్యక్షమై "వృషభాసురా! నీ తపస్సునకు మెచ్చితిని-నీకు కావలసిన వరమడుగుము" అని పలికెను. వృషభాసురుడు విష్ణుదేవుని మాటలువిని ఆనందించి "స్వామీ! నాకు స్వర్గముగాని, ఇంద్రపదవిగాని అవసరము లేదు. మీతో యుద్ధము చేయవలెనని కోరుచున్నాను" అని చెప్పెను.

విష్ణుమూర్తి అతని కోరికవిని ఆశ్చర్యపడి "అట్లే వరమిచ్చితిని. ఇక తపస్సుమాని యుద్ధమునకు రమ్ము" అని పలికెను. అంతట వృషభాసురుడు తపస్సుకు స్వస్తిచెప్పి విష్ణుమూర్తితో యుద్ధము చేయుటకు సిద్ధపడెను. వృషభాసురుడు విష్ణుమూర్తి కేమాత్రము తీసిపోక భయంకరముగా పోరాడసాగెను.

అప్పుడు విష్ణుమూర్తి అనేక రూపములుదాల్చి వృషభాసురునితో పోరాటము సాగించెను. విష్ణుదేవుడు ఏ రూపంతో, ఏ ఆయుధంతో పోరాడుచుండెనో వృషభాసురుడుకూడ ఆ రూపంతో, అదే ఆయుధంతో పోరాడుచుండెను. ఇట్లు వారు అనేక వత్సరములు యుద్ధముచేసిరి.

వృషభాసురుడు ఎంతకాలం పోరాడినను లొంగనందున విష్ణుమూర్తి తుదకు అతనిపై చక్రమును విడిచెను. ఆ చక్రాయుధము మహిమ ముందే యెరిగియున్న వృషభాసురుడు తనకిక చావు తప్పదని గ్రహించి విష్ణుదేవుని చూచి "స్వామీ! నీ చక్రాయుధమువలన నేను చంపబడి స్వర్గమున కేగక తప్పదు. ఆ పని జరుగకముందే నా కోరిక ఒకటి తీర్చుమని ప్రార్థించుచున్నాను. అది యేమనగా, మీరు నివసించుచున్న ఈ పర్వతమునకు 'వృషభాద్రి' అను పేరు కలుగునట్లు అనుగ్రహింపుడు" అని కోరెను. విష్ణుదేవుడు అట్లే కానిమ్మని చెప్పెను. అంతలో చక్రాయుధమువచ్చి వృషభాసురుని కంఠమును ఖండించెను. విష్ణుదేవుడు అతనికి మోక్షమిచ్చెను. వృషభాసురుని కోరిక ననుసరించి గరుడాచలమునకు 'వృషభాద్రి' అను పేరుకూడ కలిగెను.

## అంజనాద్రి అను పేరుపొందిన విధము

పూర్వము అంజనాదేవి అనునామె తనకు సంతానంలేని కారణమున మతంగ మహామునివద్దకు వెళ్ళి తనకు సంతానం కలుగు మార్గము తెలుపుడని ప్రార్థించెను. మతంగముని ఆమె కోరికవిని "అమ్మా! పంపా సరోవరమునకు అరువది యోజనముల దూరమున గరుడాచలము అను గొప్ప పర్వతము కలదు. అచ్చట ఆది వరాహమూర్తి నివసించి భక్తుల కోరికలను తీర్చు

చున్నాడు. నీవు ఆ దివ్యక్షేత్రమునకు వెళ్ళి స్వామి పుష్కరిణిలో స్నానంచేసి, కొంతకాలం తపస్సు చేసినచో నీకు తప్పక సంతానం కలుగగలదు" అని చెప్పెను.

మతంగ మహాముని మాటలువిని అంజనాదేవి చాల సంతోషించి, ఆయనవద్ద శలవు తీసుకొని తక్షణం గరుడాచలమునకు వెళ్ళినది. అచ్చట స్వామి పుష్కరిణిలో స్నానంచేసి, ఆకాశగంగ తీర్థముగల ప్రదేశమున నిలచి, నిద్రాహారములు మాని తపస్సు నారంభించినది.

అట్లు తపస్సు చేయుచున్న అంజనాదేవికి ఒకనాడు వాయుదేవుడు ప్రత్యక్షమై ఒక పండునిచ్చి "అంజనాదేవీ! ఈ ఫలమును భుజించినచో నీకు మహా బలపరాక్రమములుగల పుత్రుడు పుట్టగలడు. అతడు మహా భక్తుడై గొప్ప కీర్తి పొందగలడు" అని పలికి, ఆమె నాశీర్వదించి మాయమయ్యెను.

వాయుదేవుని మాటలువిని అంజనాదేవి ఎంతో ఆనందించెను. తక్షణమే ఆ ఫలమును భుజించెను. స్వల్ప కాలంలోనే ఆమె గర్భముదాల్చి వాయువు వంటి బలపరాక్రమములుగల పుత్రునికనెను. ఆ పుత్రునకు ఆంజనేయుడను పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచి పెద్దగా చేసెను. ఆ ఆంజనేయుడే కాలక్రమమున శ్రీరామునకు నమ్మినబంటై, సాటిలేని రామభక్తుడై ఆచంద్రార్కమగు కీర్తి నార్జించెను. అంజనాదేవి తపస్సుచేసి ఆంజనేయునికన్న ప్రదేశమగుటచే గరుడాచలమునకు 'అంజనాద్రి' అను పేరుకూడ కలిగెను.

## శేషాద్రి-ఆనందాద్రి-అను పేర్లుపొందిన విధము

విష్ణుమూర్తి వైకుంఠమునందు లక్ష్మీదేవితో వినోదంగానున్న సమయాన వాయుదేవుడు ఆయనను దర్శించుటకు వచ్చెను. అప్పుడాయనను ద్వారము వద్ద కాపలియున్న ఆదిశేషుడు లోనికి వెళ్ళుటకు వీలులేదని అడ్డగించెను. "నేనిప్పుడు అత్యవసరముగు కొన్ని విషయాలు విష్ణుదేవునకు చెప్పవలసి యున్నది కావున నన్ను లోనికి పోనిమ్ము" అని వాయువు ఎంత అడిగినను ఆదిశేషుడు ఆయనను లోనికి పోనివ్వలేదు. అంతట వారిద్దరిమధ్య కలహము పుట్టి తీవ్రమైన వాగ్వాదములు చెలరేగినవి.

ఆదిశేషుడు, వాయుదేవుడు కలహపడుచున్న విషయమును లక్ష్మీదేవి గ్రహించి, ఆ సంగతి విష్ణుమూర్తికి చెప్పినది. అంతట విష్ణుదేవుడు వారి వద్దకు వెళ్ళి వాయువును చూచి "గర్విష్టియగు శేషునితో నీవు కలహపడుట తగదు" అని మందలించెను. విష్ణుదేవుని మాటలువిని వాయువు శాంతించి తన అపరాధమును క్షమించమని కోరెను. కాని ఆదిశేషుడు మాత్రం శాంతించలేదు. వాయువుకంటె తానే బలం కలవాడనని గర్వంతో ప్రగల్భాలు పలుకసాగెను.

విష్ణుదేవుడు ఆదిశేషుని మాటలు విని ఆగ్రహించి "ఓయీ! వట్టి మాటలతో నేమిలాభం? మీ యిద్దరిలో ఎవరు బలవంతులో తెలిసికొనుటకు నేనొక మార్గం చెప్పెదను. ఆ ప్రకారం చేసినచో మీలో ఎవరు బలవంతులో



నిర్ధారణ కాగలదు. అదేమన, మహామేరువు పుత్రుడగు ఆనందుని ఆదిశేషుడు చుట్టుకొని ఉండవలెను. వాయువు తన బలము నుపయోగించి ఆనందుని కదలించుటకు ప్రయత్నించవలెను. శేషుడు చుట్టుకొనియున్న ఆనందుడు కదలినచో

వాయువు బలవంతుడనీ, ఆనందుడు కదలక అట్లే ఉన్నచో శేషుడు బలవంతుడని నిర్ధారణ కాగలదు" అనగా, ఆదిశేషుడు అట్లే చేయుదమనెను.

తక్షణమే ఆదిశేషుడు ఆనంద పర్వతంవద్దకుపోయి దానిని చుట్టుకొని కదలకుండా గట్టిగా నొక్కి పట్టుకొని యుండెను. వాయువు ఆ పర్వతమును కదిలించవలెనని తీవ్రంగా వీచసాగెను. వాయువు ఎంత ప్రయత్నించినను శేషుడు ఆ పర్వతమును కదలనీయక గట్టిగా చుట్టుకొని కాపాడుచుండెను. వాయువు మరింత తీవ్రంగా వీచసాగెను. ఆ గాలికి ఆగలేక చెట్లు, పుట్టలు, కొండలు మున్నగునవి ఎగిరిపోవుచుండెను. త్రిలోకవాసులు ఆ పెనుగాలికి తట్టుకొనలేక గజగజ వణికిపో సాగిరి.

అంతట దేవతలు వాయుదేవుని శాంతింపుమని కోరిరి. "మీ యిద్దరి పట్టుదలలవల్ల మూడులోకాలకు నష్టం కలుగుచున్నది. లోకులు తమ ప్రాణాలను అరచేతులందు పట్టుకొని బాధపడుచున్నారు. కావున శాంతింపుము" అని కోరినారు. దేవతలు ఎంత కోరినను వాయువు తన పట్టుదల విడువలేదు. ఆదిశేషుని గర్వమణచవలెనను తలంపుతో మరింత గట్టిగా వాయువు వీచసాగెను.

దేవతలప్పుడు ఆదిశేషుని చూచి "ఆదిశేషా! నీవైనను పట్టుదల విడచి లోకములను కాపాడుము" అని కోరిరి. శేషుడు వారి ప్రార్థన కాదనలేక తన శిరస్సు నొకదానిని యెత్తెను. అంతట పట్టుతప్పిన ఆనంద పర్వతము పెనుగాలికి తట్టుకొని నిలువలేక ఆకాశమార్గాన నెగిరిపోవు చుండెను. అప్పుడు మేరువు తన కుమారునకు కలిగిన కష్టమును తొలగించుమని వాయుదేవుని ప్రార్థించెను.

వాయువు మేరువు ప్రార్థన విని జాలిపడి ఆనంద పర్వతమును స్వర్ణ ముఖీ నదికి ఉత్తర భాగానగల వరాహ క్షేత్రమున నిలిపెను. అప్పుడు దేవతలు వాయుదేవునిచూచి "వాయుదేవా! ఆదిశేషుడు విష్ణుమూర్తి అంతరంగుడు, ఆయనతో నీవు కలహం పెట్టుకొనుట మంచిదికాదు. నీవు శేషుని ఆశీస్సులను పొందవలెను, కపట నాటక సూత్రధారియగు విష్ణుదేవుడు తన కార్యము నెరవేర్చుకొనుటకు మిమ్మిట్లు పురిగొల్పి మీ ద్వారా ఆయన భూలోకాన నివసించుటకు మేరు పుత్రుడగు ఆనందుని యిచ్చటికి చేర్పించినాడు" అని చెప్పగా, వాయుదేవుడు ఆనందించి, ఆదిశేషుడికు నమస్కరించి "భగవానుడు మనలను యిట్లు ప్రోత్సహించి తన నివాసం కొరకు ఆనంద పర్వతమును తెప్పించుకొనెను. ఈ రహస్యం తెలిసికొనలేక మనం వృధాగా తగవు పడినాము. నన్ను మన్నింపుము" అనగా, ఆదిశేషుడు ఆనందించి, వాయువు నాశీర్వదించి పూర్వంవలె స్నేహంగా ఉండసాగెను. ఆనాటినుండి గరుడాచలమునకు "శేషాద్రి" అని, "ఆనందాద్రి" అని పేర్లు కలిగినవి.

## వేంకటాచలము అను పేరుకలిగిన విధము

పూర్వం కాళహస్తిలో పురందరుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు మాధవుడు అను కుమారుడు కలిగెను. మాధవునకు ఆయన సకల శాస్త్రములు, పురాణాలు చెప్పించెను. గుణవంతురాలగు కన్యనుచూచి వివాహం గావించెను. వారు ఆనందంగా కాలం గడుపుచుండిరి. ప్రజలలో మంచి పేరు ప్రతిష్ఠలు కలిగి, గౌరవంగా చూడబడుచుండిరి.

కొంతకాలానికి పురందరుడు మరణించెను. మాధవుడు తండ్రికి శాస్త్రోక్తంగా కర్మక్రియలు జరిపించెను. భార్యతో అన్యోన్యానురాగములు కలిగి ఆనందంగా జీవించుచూ, శ్రద్ధాభక్తులతో దైవకార్యాలు చేయుచుండెను.

ఇట్లు జరుగుచున్న సమయాన మాధవుడు ఒకనాడు పుష్పములు కోసి తెచ్చుటకై అడవికి వెళ్ళెను. అప్పుడతనికి ఆ వనములో ఒక చండాల స్త్రీ కనబడెను. మాధవుడు ఆమె అందచందములుచూచి ముగ్ధుడయ్యెను. ఆమె యెంత చెప్పినను వినక "నీవు నా పాలిటి దేవకన్యవు కాని చండాల స్త్రీవి కావు" అని మెచ్చుకొని, ఆ చండాల కాంతతో కాపురం చేయుచు, ఆమె యింటిలోనే ఉండిపోయెను. అగ్నిసాక్షిగ వివాహమాడిన కన్యను అష్టకష్టములపాలు గావించెను, ఇట్లాతడు మహా పాపియైనాడు.

కొన్నాళ్ళకు మాధవుని ప్రియురాలగు చండాలకాంత అకస్మాత్తుగా మరణించినది. మాధవుడు ఆమె చనిపోయినందున తీరని దుఃఖమునకు గురియైనాడు. దుఃఖం భరించలేక పిచ్చివాడై ఊరూరు తిరుగుచు బిచ్చమెత్తుకొని జీవించసాగెను.

ఇట్లు పిచ్చివాడై ఊరూరు తిరుగుచున్న మాధవుడు కొందరు యాత్రికుల వెంటబడి శేషాద్రిని చేరినాడు. కపిల తీర్థమున స్నానంచేసిన తక్షణం మాధవుని చండాలత్వం తొలగినది. అతని సమస్త పాపాలు నశించినవి. దివ్యజ్ఞానం కలిగినది.

పిమ్మట మాధవుడు శేషాద్రిపై కేగి స్వామి పుష్కరిణిలో మునిగి పైకి లేచినంతలో శ్రీనివాసుడు ప్రత్యక్షమై "ఓయీ, నీవు పాపరహితుడవైతివి.

నీ చండాలత్వం నశించినది. ముందుజన్మలో నీవు పాండవ వంశమందు పుట్టిన సుధర్మరాజు పుత్రుడవై పుట్టి చోళరాజ్యమును పాలించగలవు, సాక్షాత్తు లక్ష్మి దేవి నీకు పుత్రికగా లభించగలదు. ఆమెను నాకు యిచ్చి వివాహంచేసి శాశ్వత మైన కీర్తి నార్జించగలవు. ముక్తి పొందగలవు" అని పలికి. ఆశీర్వదించి అదృశ్యమయ్యేను.

ఆ మాధవుడే కొంత కాలానికి ఆకాశరాజై జన్మించి, తన పుత్రిక యగు పద్మావతిని శ్రీనివాసునకు యిచ్చి వివాహంచేసి ఆ చంద్రతారార్కమగు కీర్తి నార్జించెను. ముక్తి పొందెను.

మాధవుని సకల పాపాలను నశింపజేసి ఉత్తమ జన్మ కలిగించుటవలన గరుడాచలమునకు "వేంకటాచలము" అను పేరు కలిగెను.

అట్టి దివ్యక్షేత్రమగు తిరుమల—తిరుపతిలో వెలసి భక్తకోటిని కాపాడుచున్న శ్రీనివాసుడు ఎవరో; పద్మావతీదేవి ఎవరో, వారి దివ్యచరిత్ర ఎట్టిదో ఇక తెలిసికొందుము. ధన్యులు కండు.

## శ్రీనివాస అవతార చరిత్ర

శ్రీమంతమగు భారతదేశంలో నైమిశారణ్యం పరమ పవిత్రమైనది. అందువలన శౌనకాది మహామునులు అందరూ అచ్చటచే తపస్సుచేస్తూ ఉండేవారు, వ్యాసమహర్షి వ్రాసిన పదునెనిమిది పురాణాలను వారు సూత మహర్షివలన విని యున్నారు. ఆ పురాణాలు విని ఆనందించిన శౌన కాది మునులు ఒకప్పుడు

సూత మహామునిని శ్రీనివాసుని అవతార గాథలు, మహిమలు చెప్పవలసినదని కోరినారు.

అప్పుడు సూత మహర్షి వారితో "మునీంద్రులారా! కలియుగంలో మానవులను తరింప జేయుటకు శ్రీ విష్ణు దేవుడు వేంకటాచలముపై శ్రీనివాసుడు అను పేరుతో అవతరించెను. శ్రీనివాసుడు కలియుగ ప్రత్యక్ష దైవం. భక్తులకు ఏ విధమైన బాధలు కలుగకుండ కంటికి రెప్పవలె కాపాడుచుండును. ఆయన దివ్యచరిత్ర విన్నవారికి ఇహపర సుఖాలు కలుగును. కనుక మీరందరూ భక్తిశ్రద్ధలతో వినవలసినది" అని ఈ విధంగా చెప్పెను.

బ్రహ్మదేవుని కుమారుడు నారదుడు. ఆయన దేవ ఋషి, నారద మహర్షి హరినామ స్మరణజేస్తూ అన్ని లోకాలూ తిరుగుతూ అందరి ప్రజలకు దైవలీలలను తెలుపుతూ వారిలో భక్తిశ్రద్ధలు కలుగునట్లు చేయుచుండును. భక్తులను, పతివ్రతలను, సజ్జనులను రక్షించే విషయంలోను ఆయన విష్ణుమూర్తికి చేదోడు వాదోడుగా ఉండి చిన్న చిన్న తగవులు పెట్టి ఆనందిస్తూ ఉంటాడు.

ఆయన ఒకనాడు తన తండ్రియైన బ్రహ్మదేవుని దర్శించుటకై సత్య లోకమునకు పోయెను. ఆ సమయాన బ్రహ్మదేవుడు పద్మాసనంపై కూర్చుండి ఇంద్రాది దేవతలతో ముచ్చటించుచుండెను. నారదుడు ఆ సభలో ప్రవేశించి బ్రహ్మదేవునకూ, సరస్వతీదేవికీ నమస్కరించి నిలబడెను. బ్రహ్మ నారదుని చూచి ఆనందించి, ఆశీర్వదించి కూర్చుండమని చెప్పెను. నారదుడు అన్నిలోకములూ తిరుగుతూ ఉంటాడు. కావున ఆయా లోకాలలోని వింతలూ, విశేషములూ తెలుసుకొనవచ్చునని సభలోని వారంతా సంతోషపడుచున్నారు.

అట్టి సమయంలో బ్రహ్మదేవుడు నారదునిచూచి "నాయనా! నీవు మహా భక్తుడవు కనుక నీవు ఒక మహాకార్యమును నిర్వర్తించి లోకమునకు మేలు చేకూర్చవలెను. అది యేమనగా, భగవంతుడగు శ్రీ మహావిష్ణువుయొక్క అవతారం కలియుగంలో లేదు. మానవులు దేవునియందు భక్తిలేక మూర్ఖులై పాపపు పనులు చేస్తూ నరకం పొందుతున్నారు. కనుక నీ నేర్పుచే యెట్లయినను విష్ణుమూర్తి భూలోకంలో అవతరించునట్లు చేయుము. అప్పుడు మానవులు దైవభక్తి కలిగి తరింతురు" అని చెప్పెను.

బ్రహ్మదేవుడు చెప్పినమాటలు నారద మహర్షికి ఆనందం కలిగించినవి. తాను ఈ పనిచేసి లోకమునకు మేలుచేయవలెనని నిశ్చయించుకొనినాడు. తండ్రివద్ద శెలవుపొంది హరినామస్మరణ చేస్తూ భూలోకమునకు బయలుదేరినాడు.

అప్పుడు కశ్యపుడు మొదలగు మహామునులు గంగాతీరములో గొప్ప యజ్ఞం చేయనారంభించిరి. నారదుడు ఆ యజ్ఞశాలవద్దకు వెళ్ళినాడు. మహామునులు అందరూ నారదమహర్షిని చూచి ఎంతో ఆనందించినారు. ఆయనను ఉచితరీతిని గౌరవించినారు.

నారదుడు తన సంకల్పం నెరవేర్చుకొనుటకు అదే మంచి సమయమని నిశ్చయించుకొన్నాడు. కశ్యపాది మహామునులను చూచి "మహాత్ములారా! మీరు భక్తితో చేయుచున్న ఈ యజ్ఞమునుచూచి చాల సంతసించుచున్నాను. కాని నాకు ఒక సందేహం కలిగినది. అది ఏమందురా, మీరుచేసే యజ్ఞం ఏ దేవుని గురించి? ఈ యజ్ఞమునకు ఫలమిచ్చే దేవుడు త్రిమూర్తులలో ఎవరు? నేను ఎంతకాలం

నుండియో యజ్ఞఫలము నొసగే దేవుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఎవ్వరు? యజ్ఞ ఫలము నొసగే దేవుడు ఎవరో తెలిసికొనలేక తికమక పడు చున్నాను. మహానుభావులగు మీరు నా సందేహం తీర్చి పుణ్యం కట్టుకొనుడు" అని అడిగినాడు.

నారదమహర్షి మాటలువిన్న మహామునులందరు తెల్లబోయినారు. త్రిమూర్తులలో ఏ దేవుని పేరూ చెప్పుటకు సాహసించ లేకపోయారు. తగు సమాధానం చెప్పలేక ఒకరి ముఖం ఒకరు చూచుకొనుచుండిరి. అప్పుడు నారదముని వారినుద్దేశించి "మహాత్ములారా! త్రిమూర్తులలో సత్వగుణము కలిగి మోక్షము నిచ్చే దేవుడు ఎవరో ముందుగా తెలుసుకొని యజ్ఞ ఫలమును ఆ దేవునకు ధార పోసి మోక్షం పొందుడు" అని పలికి, వారివద్ద శలవు తీసుకొని వెళ్ళిపోయినాడు.

నారద మహర్షి అచ్చటినుండి వెళ్ళిపోతూ తనలో ఇలా అనుకొనినాడు "నేను చెప్పిన మాటలను అనుసరించి ఈ మునీశ్వరులు త్రిమూర్తులను పరీక్షిస్తారు. ఆ పరీక్షలో బ్రహ్మదేవుడూ, శంకరుడూ ఓడిపోతారు. విష్ణుదేవుడే గెలుస్తాడు. ఆ పరీక్ష సందర్భంలో లక్ష్మీదేవికీ, విష్ణుమూర్తికి అభిప్రాయభేదం కలుగుతుంది. లక్ష్మీదేవి భర్తపై అలిగి భూలోకమునకు వెళ్ళిపోతుంది. లక్ష్మీదేవి నెడబాసి వైకుంఠమున ఉండలేక విష్ణుమూర్తికూడ భూలోకమునకు వెళ్ళిపోతారు. ఈ విధంగా విష్ణుమూర్తి భూలోకంలో వెలుస్తాడు. ఆ అవతారమును సేవించి ప్రజలు తరిస్తారు."

నారదుడు చెప్పినమాటలు మునీశ్వరులందరకు నచ్చింది. 'భగవంతుని గొప్పతనం తెలిసికొనుట భక్తుల విధి. సత్వగుణం, రజోగుణం, తమోగుణం-

అను ఈ మూడు గుణములలో సత్వగుణ ప్రధానమైనదే భగవంతుని స్వరూపం. కనుక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో సత్వగుణ ప్రధానుడైన దేవుడు ఎవరో తేల్చుకొనవలసియున్నది. మనలో ఒక మహాత్ముని పంపి త్రిమూర్తులను పరీక్షించినయెడల మాత్రమే మన సందేహం తీరగలదు' అని తీర్మానించుకొన్నారు.

త్రిమూర్తులను పరీక్షించుటన్న సామాన్యమైన పనికాదు. అందువలన ఎవరికివారే భయపడి వెనుకంజ వేసినారు. అందరునూ ఆలోచించి మహాతపస్సం పన్నుడగు భృగు మహర్షి మాత్రమే త్రిమూర్తులను పరీక్షించుటకు సమర్థుడని తీర్మానించుకొన్నారు. అందరూ కలసి భృగు మహర్షిని చూచి త్రిమూర్తులను పరీక్షించి వారిలో సత్వగుణ ప్రధానుడైన దేవుడెవరో నిర్ణయించమని కోరినారు. వారి ప్రార్థనను కాదనలేక భృగు మహర్షి త్రిమూర్తులను పరీక్షించుటకు బయలు దేరినాడు.

## భృగుమహర్షి సత్యలోకమునకు వెళ్ళుట

భృగు మహర్షి మొదట సత్యలోకమునకు వెళ్ళెను. అప్పుడు బ్రహ్మ దేవుడు నిండుసభలో స్వర్ణ సింహాసనముపై కూర్చుండి వేద ధర్మములను బోధించుచుండెను. ఆ సభలో ఇంద్రాది అష్టదిక్పాలకులూ, ఆదిత్యాది నవగ్రహములూ, దేవతలు, మహాఋషులు, యక్షులు, గరుడ గంధర్వాదులు ఉన్నారు.

అట్టి మహాసభలోనికి భృగుమహర్షి ఏమాత్రం భయపడక, ముందుకు వెళ్ళి బ్రహ్మదేవుని సమీపంలో ఉన్న ఒక ఆసనముపై కూర్చుండెను. ఆయన

ప్రవర్తనకు సభలో నున్నవారంతా ఆశ్చర్యపడినారు, ‘ఎంత మహాముని అయితే మాత్రం, బ్రహ్మదేవునకు ఒక నమస్కారమైనా చేయకుండ నిర్భయంగా సభలో



భృగుమహర్షి సత్యలోకమునకు వెళ్ళుట

ప్రవేశించి బ్రహ్మదేవుని ఆజ్ఞలేకుండా గద్దెపై కూర్చున్నాడు. ఇంత గర్వం ఉండకూడదు’ అని గుసగుస లాడుకొన్నారు.

భృగు మహర్షి ప్రవర్తన బ్రహ్మకు అవమానకరముగా తోచినది. అనుమతి లేకుండా తన సభలో ప్రవేశించుటయేగాక, సృష్టికర్తయగు తనకు నమస్కారమైనా చేయకుండ నిర్లక్ష్యముగా ఆసనముపై కూర్చున్న భృగుముని మీద బ్రహ్మకు ఆగ్రహము కలిగినది. కళ్ళెర్రజేసి కఠినముగా ఇలా అన్నాడు. "ఏమోయీ, భృగు! నా అనుమతిలేకుండా సభలో ప్రవేశించినావు. సరే, పోనీ పెద్దవైన నాకొక నమస్కారమయినా చేయకుండా నిర్లక్ష్యముగావచ్చి ఆసనముపై కూర్చున్నావు. నీవు యింత గర్వముగలవాడవని నేను ఇంతవరకు అనుకొనలేదు. ఇకముందైనా బుద్ధిగా ప్రవర్తించు" అని మందలించెను.

బ్రహ్మదేవుని మాటలువిని భృగుమహర్షి తనలో 'ఔరా! బ్రహ్మదేవునకు ఎంత దురభిమానము? నేను నమస్కారము చేయనంతమాత్రమున ఈయన గొప్పతనము తగ్గిపోవునా? శాంత స్వభావులకు యితరుల పొగడ్తలతో గాని, పూజలతోగాని పనియేమున్నది? ఆత్మాభిమానముగల రాజసగుణ ప్రధానులకేగదా గర్వముండును? బ్రహ్మదేవుడు అట్టి రాజసగుణము కలిగియున్నాడు. కనుక ఈయన యజ్ఞ ఫల మీయజాలడు' అనుకొని, బ్రహ్మకు ప్రత్యుత్తరము చెప్పకుండ సభనుండి వెళ్ళిపోయెను.

## భృగుమహాముని కైలాసమునకు వెళ్ళుట

అచ్చటినుండి ఆయన తిన్నగా కైలాసము వెళ్ళినాడు. శంకరుని మందిరమువద్దకు వెళ్ళి కావలియున్న వానినిచూచి "ఓయీ. పరమేశ్వరుడు ఏమి చేయుచున్నాడు? నేను ఆయనను దర్శించి మాట్లాడవలెనని వచ్చితిని. పోయి

చెప్పిరమ్మ" అనగా, ద్వారపాలకుడు "అయ్యా! పరమేశ్వరుడిప్పుడు పార్వతీ దేవితో ఏకాంత మందిరమందున్నారు. మీరు ఇప్పుడు ఆయనను దర్శించుటకు వీలుకాదు. కొంత తడవు వేచియుండుడు" అని చెప్పెను.

ఆ మాటలు విని భృగుముని శంకరుని పరీక్షించుటకు తగిన సమయము ఇదే అని నిశ్చయించుకొని ద్వారపాలకుడు అడ్డుచెప్పినను ఆగక చర చర లోపలికి వెళ్ళినాడు. ఆకస్మికముగా లోనికి వచ్చిన భృగుమహర్షిని శివుని ఒడి యందు కూర్చుండియున్న పార్వతీదేవి చూచి సిగ్గుపడి ప్రక్కకు తొలగి పోయినది. ఏకాంతముగ నున్న భార్యాభర్తలను ఇతరులు చూడరాదనుసంగతి తెలిసియుండియూ మూర్ఖముగా తనవద్దకు వచ్చిన భృగుమహర్షిపై శంకరునకు విపరీతమయిన కోపము కలిగినది. భృగుమునిని చూచి కండ్లెర్రజేసి "ఓరీ మూర్ఖా! భార్యాభర్తలు ఏకాంత మందిరలోనున్న సమయమున ఇతరులు ప్రవేశింపవచ్చునా? నా సేవకుడు అడ్డగించిననూ నీవు లక్ష్యపెట్టక లోనికి వచ్చినావు. ఇంతకాలము నీవు ఎంతో బుద్ధిమంతుడవని, మహాత్ముడవని గౌరవించుచున్నాను. నీవు ఇంత మూర్ఖుడవనుకొనలేదు. నీ గర్వమునకు తగిన ఫలితమనుభవించుము" అని మూడవకన్ను తెరచి తీక్షణముగా చూచెను. ఆ కంటినుండి అగ్నిజ్వాల పుట్టి భృగుమహర్షిని భస్మము చేయుటకు ఆయన సమీపమునకు పోవుచుండగా ముని శ్రేష్ఠుడగు భృగు మహర్షి తన పాదమును పైకెత్తి అందున్న జలనేత్రమును విప్పగా జలము బయలువెడలి అగ్నిజ్వాలను ఆర్పివేసెను. అది గమనించి శంకరుడు ఆశ్చర్యపడి "ఓయీ, బ్రహ్మ వంశమున పుట్టినవాడవని, ఋషిశ్రేష్ఠుడవని

దయదలచి విడిచిపెట్టుచున్నాను. పోయి బుద్ధిగా బ్రతుకుము, తక్షణము యిచ్చటి నుండి వెళ్ళిపొమ్ము" అని కఠినముగా చెప్పెను.



భృగు మహాముని కైలాసమునకు వెళ్ళుట.

శంకరుడు అన్నమాటలు విని భృగు మహర్షి బాధపడలేదు. తనలో యిలా అనుకొన్నాడు— 'ఆహా! మహా విరాగియగు నీ మహాదేవునకు ఇంత

ఆగ్రహము కలుగుటకు కారణము ఈయన యందున్న తామస గుణమే. తామస గుణము గలవాడు కనుకనే సర్వజ్ఞుడై యుండియు శాంతముగా నేను వచ్చిన పని గ్రహింపక ఆగ్రహించినాడు. తామసగుణ ప్రధానుడగు ఈశ్వరుడు యజ్ఞ ఫల మొందజాలడు. ఇక విష్ణుదేవుని పరీక్షించెదగాక!'

## భృగుమహర్షి వైకుంఠమునకు వెళ్ళుట

ఇట్లనుకొని కైలాసమును విడిచి వైకుంఠమునకు బయలుదేరినాడు. విష్ణువుని మందిరమువద్దకు పోయినాడు. ఆ సమయమున విష్ణుమూర్తి శేష పాన్పుపై పవ్వళించి యుండెను. లక్ష్మీదేవి ప్రక్కన కూర్చుండి ఆయన పాద ములు ఒత్తుచుండెను. ఆ సంగతి భృగుముని గమనించి వేగముగా విష్ణుదేవుని వద్దకుపోయినాడు. వెనుకముందు లాలోచించక నిద్రపోవుచున్న నారాయణుని వక్షస్థలముపై తన్నినాడు. అతని ప్రవర్తనచూచి లక్ష్మీదేవి తెల్లబోయినది. తన్ను తిన్న నారాయణుడు త్రుళ్ళిపడి లేచినాడు. ఎదుటనున్న భృగుమహర్షిని చూచి, పాన్పుదిగి, ఆయన పాదము పట్టుకొని "మహాత్మా! మీ పాదధూళి సోకుటవలన నా దేహము పవిత్రమయినది. కఠినమగు నా దేహము తగులుటవలన కోమల మగు మీ పాదమెంత నొచ్చుచున్నదో! పాపము" అని ఆయన పాదమును వత్తుచూ "స్వామి! మీ రాకకు కారణమిప్పుడు గ్రహించితిని. నాకు మీపై కోపమేమాత్రము లేదు. నిశ్చింతగా ఉండుడు" అని పలికెను.

చిరునవ్వు నవ్వుతూ, విష్ణుమూర్తి పలికిన మాటలు భృగుమహర్షికి ములుకుపోట్లవలె నాటినవి. వెంటనే నారాయణుని పాదములపై పడి "దేవాది దేవా!" పరీక్షింపవలెనని వచ్చి పరమాత్ముడవైన నిన్ను తన్ని పాపము ఒడి

గట్టుకున్నాను. నా అపరాధము క్షమించి నన్ను కాపాడుడు" అని వేడుకొని నాడు.



భృగుమహర్షి వైకుంఠమునకు వెళ్ళుట

విష్ణుదేవుడు ఆయనను పైకెయెత్తి "భృగుమునీంద్రా! నీవు ఎట్టివాడవో నేను యెరుగుదును. నీవు ఇచ్చటికి వచ్చిన కారణము గ్రహించితిని. నీ వలన

నాకును లోకమునకు కూడ మేలు కలుగనున్నది! కాని హాని యేమియూ కలుగ లేదు. నీవు విచారపడవలసిన పనిలేదు. నిశ్చింతగా ఉండుము అని పలికి. "నీకు శుభమగుగాక! పోయిరమ్మ" అని ఆశీర్వదించి పంపెను.

అంతట భృగుమహర్షి వైకుంఠమునుండి సంతోషముగా బయలుదేరి యజ్ఞము చేయుటకు సిద్ధంగా నున్న మహామునుల వద్దకు పోయినాడు. జరిగిన విషయములు వారికి వివరంగా తెలియజేసి, త్రిమూర్తులలో విష్ణుదేవుడే సత్వగుణ సంపన్నుడని నిరూపించి పరమాత్ముడగు విష్ణుమూర్తికే యజ్ఞఫలం ధారపోయించి నాడు.

## లక్ష్మీదేవి వైకుంఠమును వదలి భూలోకమునకు పోవుట

భృగుమహర్షి ప్రవర్తన చూచి లక్ష్మీదేవి తీవ్రమయిన ఆగ్రహం పొందినది. విష్ణుమూర్తిపై అలిగి "నాథా! పదునాలుగులోకములకు ప్రభువులైన మీ విషయం ఆ భృగుముని ఎంత పొగరుగా ప్రవర్తించినాడో చూచితిరిగదా, దేవేంద్రాది సకల దేవతలచే పూజింపబడుచున్న మిమ్ము ఆ దురాత్ముడు తన్నుట కెట్లు సాహసించెనో? ఎంత అవమానకరమయిన విషయమిది! నా నివాసస్థానమగు మీ వక్షస్థలంపై తన్నిన నన్ను తన్నినట్లేగదా? ఇట్టి మహాపరాధం చేసిన ఆ దురాత్ముని శిక్షించకుండ అతని పాదమునొత్తి ఆశీర్వదించి పంపినారు. ఈ యవ మానమును భరించి నేనిచ్చట ఉండలేను. ఆ మునిని సర్వనాశనం చేయక విడు

వను" అనగా, విష్ణుమూర్తి మందహాసంచేసి "దేవీ! భృగుమహర్షి దుర్మార్గుడు గాని, పొగబోతుకాని కాడు. అతడు మహర్షి, శ్రేష్టుడు, పరమభక్తుడు. భక్తునకూ భగవంతునకూ గల సంబంధమెట్టిదో తెలియక నీవు ఆయనపై కోపించినావు. భక్తుల మనస్సు తెలిసికొనుట చాలా కష్టం. నేను తప్ప మరొకరు ఆ విషయం తెలిసికొనలేరు. భృగుమహర్షి ఒక గొప్ప కార్యమును సాధించుటకు అట్లు ప్రవర్తించినాడు. కాని నా యంతటివాడు లేడని గర్వంతో చేయలేదు. భక్తులు మనకు బిడ్డలవంటివారు. అట్టిబిడ్డలపై మనం ఆగ్రహించకూడదు" అని యెంత నచ్చచెప్పిననూ లక్ష్మిదేవి తాను పట్టిన పట్టు విడువలేదు.

"నాథా! భృగుముని చేసిన మీకు ఇష్టమైతే అగుగాక! నేను మాత్రం సహించలేను. ఆ దురాత్ముని శిక్షించమానను. ఈ అవమానం భరించి నేను వైకుంఠంలో ఉండలేను. ఎచ్చటికైనను పోయెదను. ఈ విధంగా మనల్ని వేరుచేసిన ఆ బ్రాహ్మణుడు, అతని వంశంలోని వారు వేదకర్మవిహీనులై, దరిద్రులైన విద్యల నమ్ముకొని జీవింతురుగాక!" అని శపించి, వైకుంఠమును వదలి వెళ్ళిపోయెను.

ఆ విధంగా లక్ష్మిదేవి విష్ణుమూర్తిపై అలిగి, వైకుంఠమును వదలి పోయి, పోయి భూలోకం చేరెను. నదీనదములు, కొండలు, గుట్టలు. పల్లెలు పట్టణములు దాటి తుదకు గోదావరి తీరమునగల కొల్లాపురంనందు నిలిచి అచ్చట ఒక పర్ణశాల నిర్మించుకొని తపస్సు చేయసాగెను.

తనను విడిచి మహాలక్ష్మి వెళ్ళిపోవుటవలన విష్ణుమూర్తి మనస్సు వికలమైపోయినది. నిద్రాహారములు మాని లక్ష్మికై పరితపించసాగెను. లక్ష్మి

లేని వైకుంఠం నాకెందుకు అని దుఃఖించసాగెను. భక్తులను రక్షించు పనిని మరచెను. వైకుంఠమును వదలి లక్ష్మిని గూర్చి వెదకుచూ బయలుదేరెను. అన్ని లోకములు వెదకి తుదకు భూలోకము చేరెను. "ప్రాణేశ్వరీ! ఎచ్చట వున్నావు? నీవు నన్ను విడిచిపోవడంవలన నా జీవితమే వ్యర్థమైనది. నిన్ను చూడకుండ నేను జీవించలేను" అని చింతించుచు ఎండలకెండుచు, వానలకు తడుస్తూ కొండలు, గుహలు, వనములు వెదకుచూ, కనబడిన జీవులన్నిటిని 'లక్ష్మి కనబడినదా' అని అడుగుచూ పోసాగినాడు, ఎంత వెదకినను లక్ష్మి జాడ తెలియలేదు. ఆహార పానీయములు లేనందున ఆయన దేహం శుష్కించిపోయినది. నిద్రలేమిచే శరీరం తూలిపోవుచున్నది. ఇక వెదకుటకు శక్తిలేక శేషాద్రి ప్రాంతమున నాగలక్ష్మికై తపస్సు చేయనారంభించెను.

శేషాద్రి ప్రాంతమును గూర్చి పాఠకులు ఇంతకుముందే తెలుసుకొనియున్నారు. నేడు తిరుమల-తిరుపతి అని చెప్పకొనబడుచున్న పర్వత ప్రాంతమే శేషాద్రి ప్రాంతం. ఆ ప్రాంతముననే శ్రీ మహావిష్ణువు ఒక పుట్టలో కూర్చుండి లక్ష్మికై తపస్సు చేయుచుండెను.

## వైభవమును కోల్పోయిన వైకుంఠము

లక్ష్మీనారాయణులు లేనందున వైకుంఠం దీపధూప నైవేద్యములు లేని దేవాలయంవలె, చంద్రుడులేని రాత్రివలె శోభావిహీనమైనది. ఆ విషయము నారదముని గ్రహించి, సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మను దర్శించి యిలా చెప్పెను: "తండ్రీ! మీరు సూచించినట్లు నారాయణుడు భూలోకమునందు

అవతరించుటకు తగు ప్రయత్నం చేశాను. అందువల్ల లక్ష్మీనారాయణులకు ఎడబాటు కలిగినది. నారాయణుని విడిచి వెళ్ళిన లక్ష్మీదేవి కొల్లాపురంలో తపస్సు చేయుచున్నది. నారాయణుడు శేషాద్రి ప్రాంతమున ఒక పుట్టలో దాగి తపస్సు చేయుచున్నాడు. నిద్రాహారములు లేక శుష్కించి పోవుచున్నాడు. కనుక మీరు ఉపాయంతోనైనను ఆయనకు ఆహారం అందునట్లు చూడవలసినది" అని ప్రార్థించెను.

నారదుడు చెప్పిన మాటలు విని బ్రహ్మదేవుడు తక్షణం కైలాసమునకు వెళ్ళెను. శంకరుడు బ్రహ్మను ఉచితరీతిని గౌరవించి, వచ్చిన కారణమేమని ప్రశ్నించెను. బ్రహ్మదేవుడు జరిగిన సంగతులన్నియు శంకరునకు వివరంగా తెలియజేసి మనమిద్దరం ఆవు-దూడల రూపమున భూలోకమునకేగి శ్రీమన్నారాయణునకు పాలు యిచ్చుచుండిన బాగుండును" అని చెప్పెను, శంకరుడు అట్లే చేయుదమనెను.

బ్రహ్మదేవుడూ, ఈశ్వరుడూ తక్షణం బయలుదేరి కొల్లాపురంలో తపస్సు చేయుచున్న లక్ష్మీదేవి వద్దకు వచ్చి "అమ్మా! నీవు కోపగించి తనను విడచి వచ్చినందున నీ నాధుడు పిచ్చివాడైనాడు, నీపై బెంగకలిగి సకలలోకాలూ వెదకి వెదకి తుదకు భూలోకం చేరినాడు. ప్రస్తుతం శేషాద్రి ప్రాంతమున ఒక పుట్టలో తలదాచుకొనుచున్నాడు. ఆహారం లేక శుష్కించి పోవుచున్నాడు. మేము ఆవు దూడల రూపం ధరింతుము, నీవు గొల్లభామ రూపమున మమ్ము తీసుకొనిపోయి చోళరాజుకు విక్రయించుము, మేము ఆ రాజుయొక్క అవుల మందలో ఉండి ప్రతిదినం నీ నాధునకు పాలు యిచ్చి కాపాడుచుందుము" అని చెప్పినారు. లక్ష్మీదేవి అందుకు అంగీకరించెను.

బ్రహ్మ ఆవు రూపమును, శంకరుడు దూడ రూపమును ధరించిరి. ఆ యావును, లక్ష్మీదేవి తోలుకొనిపోయి చోళరాజుకు విక్రయించి తిరిగి కొల్లాపురమునకు పోయి తపస్సు చేసికొనుచుండెను.

చోళరాజుకు అనేక ఆవులు కలవు. ఆయన తన పశుల కాపరిని పిలిపించి, క్రొత్త ఆవును-దూడను అతనికి అప్పగించి "ఓరీ, ఈ ఆవుదూడలను జాగ్రత్తగా పోషించవలెను. యింత చక్కని ఆవుదూడలు మనమందలో లేవు. ఈ యావుపాలు ప్రత్యేకంగా పిండి తెచ్చి మాకు యిచ్చుచుండుము" అని ఆజ్ఞాపించెను.

## పుట్టలోవున్న విష్ణుమూర్తికి క్రొత్త ఆవుపాలు యిచ్చుట

పశువుల కాపరి ఆ యావునూ, దూడనూ తన మందలో చేర్చి శేషాద్రి ప్రాంతమునకు తోలుకొనిపోయి మేపుచుండెను. క్రొత్త ఆవు తక్కిన పశువులన్నిటితోపాటు మేత మేయక ఒంటరిగా పోయి విష్ణుమూర్తి తపస్సు చేయుచున్న పుట్టపై నిలిచి తన పాలను పుట్టలోనికి జారవిడుచుచుండెను. విష్ణుమూర్తి ఆ పాలను త్రాగుచు నిశ్చింతగా కాలం గడుపుచుండెను.

ఒకనాడైనను క్రొత్త ఆవుపాలు తెచ్చి యివ్వనందున చోళరాజు భార్య పశువుల కాపరిని గట్టిగా మందలించెను. అన్ని ఆవులతోపాటు ఆ యావు పాలు యివ్వక పోవుటకు కారణం పశువుల కాపరి గ్రహించలేక పోయినాడు. ఒకనాడు ఆ యావును ఒక కంట కనిపెట్టి చూడసాగెను. మామూలు ప్రకారం ఆ యావు

మందనుండి తప్పించుకొని పుట్టవద్దకు పోయినది. తన పొదుగును పుట్టపైనుంచి పాలధారలు విడువ సాగినది.



పుట్టలోవున్న విష్ణుమూర్తికి క్రొత్తఆవు పాలు యిచ్చుట

గోపాలుడు ఆ యావు యొక్క చర్యలు గమనించి పట్టరాని కోపము పొందెను. తనచేతియందున్న గండ్రగొడ్డలిని పైకెత్తి ఆ యావును కొట్టబోవు

చోళరాజు ఆ క్షణంనందే పిశాచమై అచ్చటి నుండి పారిపోయెను. గోపాలుడు మూర్ఛనుంచి తేరుకున్న తరువాత గ్రుడ్డివాడయ్యెను. అతడు తన అపరాధమును క్షమించవలసినదిగా విష్ణుమూర్తి పాదములపై పడి ఎంతో దీనంగా వేడుకొనెను. స్వామి అతనిపై జాలిపడి "ఓరీ! త్వరలోనే నీ శేషాద్రిపై వెలయుచున్నాను. అంతవరకు అంధుడవై యుందువు. నా యవతారం చూడగానే నీకు చూపు లభించగలదు. పోయి బుద్ధిగా బ్రతుకుము" అని పలికి, తన గాయం మాన్పుటకు తగిన ఓషధికై వెదుకుచు బయలుదేరెను.

## వరాహస్వామి శ్రీహరిని గుర్తించి గౌరవించుట

శ్రీనివాసుడు ఓషధికై వెదకుచు క్రమంగా కొండమీదకుపోయెను. పోయి పోయి వరాహస్వామి ఆశ్రమం వద్దకు చేరెను. వరాహస్వామి శ్రీహరిని గుర్తించి గౌరవించెను. జరిగిన సంగతులన్నియు దివ్యదృష్టిని గ్రహించెను. శ్రీనివాసుని కౌగలించుకొని "సోదరా! దిక్కులేని వానివలె నీవిట్లు ఒంటరిగా ఉండవలసిన అవసరంలేదు. నా ఆశ్రమ ప్రాంతంలో కొంత స్థలం తీసుకొని నివసించుచు నిశ్చితంగా ఉండుము. నా వద్ద వకుళ మాలికయను భక్తురాలున్నది. ఆమె నీకు ఏ విధమైన లోటు కలుగనీయక సంరక్షించుచుండగలదు" అని చెప్పెను.

శ్రీనివాసుడు వరాహస్వామి మాటలు విని ఎంతో సంతోషించి "అన్నా! నేను లక్ష్మికి దూరమై ప్రస్తుతం అష్టకష్టములు అనుభవించుచున్నాను.

ఇట్టిస్థితిలో మీరిచ్చు స్థలమునకు ప్రతిఫలంగా ఏమియూ చెల్లించలేను; మీరు చేయుచున్న సహాయమునకు కృతజ్ఞతగా, నన్ను చూచుటకు వచ్చు భక్తులు




వరాహస్వామి శ్రీనివాసుని గుర్తించి గౌరవించుట

ముందుగా మిమ్ము దర్శించునట్లును, మీకు పూజలు చేసి నైవేద్యం, కానుకలు సమర్పించిన తరువాతనే నాకు చెల్లించవలెనని కట్టడి చేయుదును. మీరు నాకు

చేయుచున్న సహాయమునకు ప్రతిఫలం ఇంతకంటే ఏమీ యివ్వలేను" అని చెప్పెను.

వరాహస్వామి శ్రీనివాసుని మాటలు విని సంతోషించి తన ఆశ్రమ ప్రాంతమునగల పంద అడుగుల స్థలమును ఆయనకు ఇచ్చెను. తనను సేవించుచున్న వకుళ మాలికను శ్రీనివాసుని సంరక్షణకై నియమించెను. వకుళ మాలిక ఆయన గాయమునకు మందుపూసి, కట్లు కట్టి త్వరలోనే బాగుచేసెను.

అప్పటినుండి శ్రీనివాసుడు వరాహస్వామి తనకు ఇచ్చినస్థంలో ఒక పర్ణశాల నిర్మించుకొని నివసించసాగెను. వకుళ మాలిక ఆయనకు ఏ విధమైన లోటు కలుగనీయక సంరక్షించుచుండెను.

ఆకాశరాజు యజ్ఞశాల కొరకు బంగారు నాగలితో దున్ని భూమిని సిద్ధం చేయుచుండా లక్ష్మీదేవి వలె శోభించుచున్న ఒక స్త్రీ శిశువు లభించెను. ఆమె పద్మమునందు జన్మించెను. కావున పద్మావతి అని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచి పెద్దగావించెను.



శ్రీనివాసుడు పద్మావతీ దేవిని చూచుట

ఇట్లు కొంతకాలం గడిచిన తరువాత, ఒకనాడు శ్రీనివాసుడు వేటాడవలెనను తలంపుతో విల్లమ్ములు చేబట్టి, గుఱ్ఱముపై బయలుదేరెను. అనేక దుష్ట మృగములను వేటాడి ఆనందించెను.

అట్లు వేటాడుచున్న సమయమున ఆయనకొక మదగజ మెదురైనది. శ్రీనివాసుడు ఆ యేనుగు ననుసరించి శేషాద్రికి రెండు యోజనముల

దూరమున నున్న అగస్త్యాశ్రమానికి సమీపమునగల ఆకాశరాజు యొక్క ఉద్యా న వనంలో ప్రవేశించెను. ఎంత వెదకినా ఆయనకా యేనుగు కనబడలేదు. కాని చెలి




చెలికత్తెలతో మాట్లాడుచున్న శ్రీనివాసుడు

కత్తెలతో విహరించుచున్న ఆకాశరాజు కూతురు అగు పద్మావతి కనిపించింది. చంద్రబింబము వలె శోభించుచున్న పద్మావతిని చూచి శ్రీనివాసుడు మోహరప వశుడైనాడు. ఆమె చెంతకు పోయి తనను వివాహ మాడమని కోరినాడు.

అకస్మాత్తుగా కనబడిన నూతన యువకుని చూచి పద్మావతి భయ కంపితురాలైంది. తన చెలికత్తెలతో చెప్పి ఆయనను రాళ్ళతో కొట్టించింది. శ్రీనివాసుడు ఏమి చేయుటకును తోచక, విచారంతో తన నివాసానికి పోయెను. నిద్రాహారములు మాని పద్మావతిని యెట్లు వివాహమాడగలనా అని చింతించు చుండెను.

శ్రీనివాసుడు నిద్రాహారములు మాని, విచారముగా ఉండుటకు కారణం వకుళ మాలికకు తెలియలేదు. ఆమె శ్రీనివాసుని అనేక విధముల బ్రతిమాలి జరిగిన విషయములు తెలుసుకొన్నది. పద్మావతిని నీకిచ్చి వివాహము చేయునట్లు ఆకాశరాజు దంపతుల నెట్లయిన ఒప్పించెదను, చింత మానుమని ధైర్యము చెప్పి బెంగ తీర్చింది.

శ్రీనివాసుని చూచినప్పటి నుండి పద్మావతి మనస్సు ఆయనపైనే నిలిచి పోయింది. ఎంత ప్రయత్నించినా ఆమె ఆ రూపమును మరచిపోలేకుంది. 'అయ్యో! అతనిని రాళ్ళతో కొట్టించితిని గదా! అతనికి నాపై ఆగ్రహము కలిగి యుండును. ఆ అందగాడు తిరిగి నాకు కనబడునో, కనబడడో? ఎంత తెలివి తక్కువ పని చేసితిని? అతని ఊరుగాని, పేరుగాని ఎరుగను. ఇప్పుడేమి చేయు దును' అని విచారించసాగెను. ఏ నాటికైనా అతనినే పెండ్లాడవలెనని నిశ్చయించు కొనెను.

ఈ విధంగా పద్మావతి శ్రీనివాసునిపై మోహము కలిగి ఆయనను చూడగల అదృష్టము ఎప్పుడు కలుగునాయని చింతించుచు మనోవ్యాధిచే మంచము పట్టెను. ఆకాశరాజు దంపతులు ఆమె ఏదో రోగము కలిగి బాధపడుతున్నదను కొని గొప్ప గొప్ప వైద్యులను నియమించి మందులు యిప్పించుచున్నారు. ఎన్ని మందులు యిప్పించినా ఆమె స్థితి బాగుపడలేదు కాని దిన దినము క్షీణించిపోవు చుండెను.

ఇట్లు జరుగుచుండగా శ్రీనివాసుడు ఎరుకలసాని రూపము ధరించి, ఆకాశరాజు భార్యయగు ధరణీదేవి వద్దకు వెళ్ళి 'పద్మావతి మంచము పట్టుటకు కారణము రోగము కాదనీ, ఆమె బోయవేషంతో వున్న శ్రీనివాసుడు అను మహాపురుషుని ప్రేమించిందనీ, ఆమె నాతనికిచ్చి వివాహం చేసిన బ్రతుకగలదనీ, లేనిచో ప్రాణత్యాగం చేయగలదని చెప్పెను.

ఎరుకలసాని మాటలు విని ధరణీదేవి చాలా భయపడింది. పద్మావతి చెలికత్తెల ద్వారా ఉద్యానవనంలో జరిగిన సంగతులు తెలిసికొని, ఎరుకలసాని యధార్థమే చెప్పిందని గ్రహించింది. వెంటనే ఆ సంగతులు భర్తయగు ఆకాశ రాజు వద్దకు పోయి చెప్పింది.

ఆకాశరాజు ఆ సంగతులు విని ఆశ్చర్యానందములు పొందినాడు. భార్యతో కలిసి పద్మావతి వద్దకు వెళ్ళి "పుత్రీ! ఈ మాత్రము దానికి నీవు ఇంతగా బెంగపెట్టుకొనవలెనా ? మాకు చెప్పిన యెడల నీ కోరిక తీర్చమందుమా? నీవు ప్రేమించిన ఆ యువకుడు ఎచ్చట ఉన్నాడో వెదకించెదను. నిన్ను ఆయనకే

ఇచ్చి వివాహం చేసెదము. ఇక బెంగమాని నిశ్చింతంగా ఉండుము" అని పలుకగా, పద్మావతి చాల సంతోషించి, సిగ్గుతో తల వంచుకొనెను. ఆకాశరాజు దంపతులు చిరునవ్వు నవ్వుకొంటూ ఆమె తల నిమిరి ముద్దులాడిరి.

అదే సమయమున శ్రీనివాసుని కోరికపై పెండ్లి రాయబారానికి శేషాద్రి నుండి బయలుదేరిన వకుళ మాలిక ఆకాశరాజు అంతఃపురానికి వచ్చింది. రాజదంపతులు ఆమెను ఎంతో గౌరవించి, కూర్చుండబెట్టి "అమ్మా! మీ నివాస స్థలమేది? మీరు యిచ్చటకు వచ్చుటకు కారణమేమి?" అని ప్రశ్నించినారు.

వకుళాదేవి వారితో యిట్లు పలికింది. "మహారాజా! మీ దంపతులు మిక్కిలి పుణ్యాత్ములు. సాక్షాత్తు లక్ష్మీదేవియే మీకు బిడ్డగా లభించింది. మీరు త్రిలోక పూజ్యులైనారు. ఇక నేను వచ్చిన పని తెల్పెదను వినుడు. నా నివాస స్థలము శేషాద్రి. నాకు శ్రీనివాసుడు అను సుపుత్రుడు కలడు. అతడు పాతికేండ్ల ఈడు గలవాడు. చక్కని మాప్పురేఖలు గలవాడు. కారణాంతరముచే అతడు బిక్కికి మారుమయి ప్రస్తుతము పేద స్థితిలో ఉన్నమాట నిజము. అయినను అతడు నీ కుమార్తెకు ఏ లోటు కలుగకుండా చూడగలడు. కొన్ని దినముల క్రిందట నా కుమారుడు వేటకై ఈ ప్రాంతమునకు వచ్చినాడు. అప్పుడతడు ఉద్యానవనములో విహరించుచున్న తమ పుత్రిక యగు పద్మావతిని చూచినాడు. ఆ సుందరాంగిని చూచినప్పటినుండి అతడు ఆమెను తప్ప మరే కన్యనూ వివాహమాడనని భీష్మించుకొని కూర్చున్నాడు. నిద్రాహారములు మాని

పద్మావతి నెట్లు వివాహమాడుదునా అను చింతతో చిక్కి శల్యమయి పోవు చున్నాడు. శ్రీనివాసుడు ప్రస్తుతం ధనహీనుడైనను అతడు సకల లోకములకు



లగ్న పత్రికను శ్రీనివాసునకు సమర్పించు శుక మహర్షి

యేల గల సమర్థుడు. కనుక మీ పుత్రికను శ్రీనివాసున కిచ్చి వివాహం చేయగోరు చున్నాను" అని చెప్పెను.

ఆకాశరాజు దంపతులు ఆ మాటలు విని యెంతో ఆనందించినారు. పెద్దలతో ఆలోచించి త్వరలోనే ముహూర్తం పెట్టించి తెలియజేయవలయునని చెప్పి వకుళమాలికను ఉచితరీతిని గౌరవించి పంపినారు.

తరువాత, ఆకాశరాజు బృహస్పతిని, శుకమహర్షిని పిలిపించి పద్మావతిని శ్రీనివాసునకు యిచ్చి వివాహం చేయుటకు సుముహూర్తం పెట్టించెను. ముహూర్త పత్రికను శ్రీనివాసునకు శుకమహర్షితో పంపించెను. శ్రీనివాసుడు ఆ శుభలేఖను చదువుకొని చాలా సంతోషించెను. తక్షణం బ్రహ్మదేవుని, శంకరుని పిలిపించి, ఆ శుభవార్తను తెలియజేసి వివాహ కార్యములు జరిపించవలసినదిగా కోరినాడు. కుబేరుని వద్ద పదునాలుగు లక్షల రామనిష్కములు అప్పుగా తీసుకొని వివాహమునకు కావలసిన వస్తువాహనాదులకు వినియోగించ వలసినదని చెప్పి యిచ్చినాడు.

## శ్రీనివాసుడు పద్మావతిని వివాహమాడుట

శ్రీనివాసు డిట్లు వివాహకార్యములు జరిపించి బ్రహ్మాదిదేవతలతో కలసి, గరుత్మంతునిపై కూర్చుండి ఆకాశరాజు నివాసస్థానమగు నారాయణ పురమునకు మహావైభవంగా వెళ్ళెను. వారిని చూచి ఆనంద బ్రహ్మానంద భరితు డైనాడు. వారివారి అర్హతలకు తగిన విడిదులు యిప్పించి, సకల సదుపాయాలు చేసినాడు. శుభముహూర్త సమయాన పద్మావతీ శ్రీనివాసుల వివాహ మతి వైభవంగా చేసినాడు.

పిమ్మట ఆకాశరాజు పద్మావతీదేవిని శ్రీనివాసునకు అప్పగించి "శ్రీని వాసా! నీవు శ్రీమన్నారాయణుడవు. కాని సామాన్య మానవుడివి కావని తెలుసు



పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణ మహోత్సవము

కొన్నాము. పురుషోత్తముడవగు నీ పాదములు కడిగి మా పుత్రికను ఇచ్చుట వలన మా వంశం తరించినది. మా పూర్వజన్మ సుకృతముచే భగవంతుడవైన

నీవు మా అల్లుడవైతివి. అందువలన మా జన్మలు పావనమైనవి. నీకు తెలియని ధర్మములుగాని నీతులుగాని లేవు. అయినను కన్యాదాతనైన నేను నీకొక మనవి చేసికొనుచున్నాను అదే మన, మా పద్మావతి సుకుమారి, ప్రపంచ విషయాలు అంతగా యెరగని బాలిక. ఆమెను ఏ విధంగా ఏలుకొందువో, ఏమో! స్వామీ! పూర్వం నిన్ను రాళ్ళతో కొట్టించినదని కోపించి ఆమెను శిక్షించకు. కఠినోక్తు లాడకు?" అని పద్మావతిని చూచి "అమ్మా! నీవు సకల శాస్త్రములు చదువుకొన్న దానవు. సకల ధర్మములు యెరిగిన దానవు. భగవంతుని ధర్మపత్ని వగుట వలన నీవు మిక్కిలి అదృష్టవంతురాలవు. కుమారీ! నీవు పతి మాటను యెన్నడు గాని యెదురుచెప్పకు. సదా పతి సేవ చేయుటయందే మనస్సు నిలిపియుండుము. పెద్దలయందు వినయ విధేయతలు కలిగివుండుము. పేదల నాదరింపుము. పుట్టింటికి, మెట్టిన యింటికి పేరు ప్రతిష్టలు సంపాదించి పెట్టుము. పేదలను, సాధులను ఆదరించి పోషింపుము. అనసూయాది మహాపతివ్రతవలె అఖండయశము నార్జింపుడు" అని అనేక బుద్ధులు చెప్పినాడు.

తదనంతరం ఆకాశరాజు దంపతులు పద్మావతీ శ్రీనివాసులకు వెలగల ఆభరణాలు, వస్త్రములు పెట్టినారు. పద్మావతీదేవిని అత్తవారింటికి అతి వైభవంగా సాగనంపినారు. శ్రీనివాసుడు పద్మావతీ సహితంగా గరుత్మంతుని పైనెక్కి బ్రహ్మాది దేవతలతో కలిసి ఆనందంగా తన నివాసానికి బయలుదేరినాడు.

అట్లు పోవుచున్న శ్రీనివాసునకు మార్గ మధ్యమున అగస్త్య మహర్షి ఆశ్రమము కనబడినది. తన ఆశ్రమ ప్రదేశమునకు వచ్చిన బ్రహ్మాది దేవత

వైఖానుని కోరికవిని శ్రీమన్నారాయణుడు చిరునవ్వు నవ్వి "వైఖానసా! నీవిప్పుడు శ్రీకృష్ణావతారమును చూడలేవు. కాని శ్రీకృష్ణునితో సమానుడగు శ్రీనివాస దేవుని చూడగలవు. శ్రీకృష్ణునకు శ్రీనివాసునకు ఏ మాత్రము [illegible] [illegible]డు శేషాద్రిపై వరాహక్షేత్రం [illegible]మున వెలసియున్నాడు. కనుక ఆ శ్రీనివాసుని పూజించి, తరించుము" అని పలికి అదృశ్యమయ్యెను.

శ్రీహరి మాటలు విని వైఖానసుడు ఆనందించి అచ్చటినుంచి శేషాద్రికి పోవలెనని బయలుదేరినాడు. అట్లు పోవుచున్న వైఖానసమునికి మార్గమధ్యమున రంగదాసు అను భక్తుడు యెదురైనాడు. అతడు వైఖానసమునికి నమస్కరించి స్వామీ! ఎచ్చటికి వెళ్ళుచున్నారు?" అని అడుగుగా, వైఖానసుడు రంగదాసును చూచి "నాయనా! నేను శేషాద్రిపై వెలసియున్న శ్రీనివాసమూర్తిని దర్శించవలెనని పోవుచున్నాను" అని చెప్పెను.

వైఖానసుని మాటలు విని రంగదాసు ఎంతో ఆనందించి "మహాత్మా! తమ వెంట నన్ను కూడా తీసుకొని వెళ్ళుడు. స్వామి పూజయందు మీకు సహాయపడుచుందును" అని ప్రార్థించెను. వైఖానసుడు అందుకు అంగీకరించి రంగదాసును తనతో తీసికొని పోయెను. ఇరువురునూ కలసి కొంతకాలమునకు శేషాద్రి చేరినారు.

వైఖానస, రంగదాసులు శేషాద్రిపై కేగి, అచ్చట వెలసియున్న శ్రీనివాసుని దర్శించి బ్రహ్మానందభరితులైనారు. వైఖానసుడు రంగదాసును పిలిచి "ఓయీ! స్వామిని ప్రతిదినము పూజించినయెడల ఆయన సంతోషించి మనకు ముక్తినిచ్చును. కనుక నీవు ఈ ప్రాంతములో ఒక పూలతోట పెంచి, ప్రతిదినము స్వామిని పూజించుటకు పూవులు కోసి తెచ్చుచుండుము" అని చెప్పెను.

వైఖానసముని చెప్పిన మాటలు విని రంగదాసు ఆనందించి, ఆ ప్రాంతంలో ఒక చక్కని పూలతోట పెంచెను. పూలతోటను పెంచుటకు నీరు అవసరం కనుక అతడు ఒక బావిని కూడ త్రవ్వించెను.

ఈ విధంగా రంగదాసు ఒక చక్కని పూలతోటనువేసి, నిత్యము పూవులు కోసి వైఖానసమునికి యిచ్చుచుండెను. వైఖానసుడు ఆ పూవులతో శ్రీనివాసుని పూజించుచుండెను.

ఇట్లు జరుగుచున్న సమయమున ఒకనాడు పువ్వులుకోసి తెచ్చుటకు పోవుచున్న రంగదాసుకు మార్గమధ్యమునగల పుష్కరిణిలో జలక్రీడలాడుచున్న గంధర్వులు కనబడిరి. వారి ఆట పాటలు చూచి రంగదాసు ప్రేమపడి పోయెను. వారి విలాస క్రీడలు చూచిన అతని మనస్సు చలించెను. పూలుకోసి స్వామి పూజకు అందజేయవలెనన్న సంగతియే మరచిపోయెను. గంధర్వులు మాయమైనారు.

అప్పుడు రంగదాసు తెలివికి వచ్చినాడు. స్వామి పూజకు పూవులు అందజేయుటకు ఆలస్యమైనది గదా అని బాధపడుచు "దేవా దేవా! శ్రీనివాస స్వామీ! నా యపరాధం క్షమించుము" అని ప్రార్థించెను.

అంతట శ్రీనివాసుడు అతనికి ప్రత్యక్షమై "రంగదాసా! చింతింపకుము. నీవు నా మాయా మోహమున గంధర్వుల జలక్రీడలు చూచి చలించినావు. అట్టి సుఖములపై భ్రాంతి పొందినావు. కనుక నీవు ఈ శరీరమును విడచిన తరువాత నారాయణపురమును పాలించు సుధర్ముడను" అని పలికి అదృశ్యమయినాడు.

ఆ రంగదాసే కొంతకాలమునకు సుధర్మరాజు ద్వితీయ పుత్రుడై పుట్టెను. అతడే ఆకాశరాజు తమ్ముడగు తొండమానుడు.

పద్మావతీ శ్రీనివాసులు అగస్త్యమహాముని ఆశ్రమంలో ఉన్న సమయమున తొండమానుడు ఒకనాడు వారిని చూచుటకు వచ్చెను. పద్మాదేవి తన పినతండ్రిని చూచి ఎంతో ఆనందించెను. ఆయన నెంతో గౌరవించెను. శ్రీనివాసుడు తన ప్రియ భక్తుడును, చిన్న మామగారునగు తొండమానుని ఉచితరీతిని గౌరవించి "మీరు వచ్చిన పని ఏమిటి?" అని అడిగెను.

స్వామి మాటలు విని తొండమానుడు చేతులు జోడించి "దేవ దేవా! నా రాకకు ప్రత్యేక మేమియులేదు. భక్తవత్సలుడవైన నిన్నొకసారి దర్శించవలెనని వచ్చితిని, నీ దివ్య మంగళ స్వరూపము ఎన్నిసార్లు చూచినను తృప్తి కలుగదు కదా! ఈ దాసునిపై సర్వదా దయయుంచవలెనని వేడు

కొను చున్నాను. నేను ఈ జన్మలో చేయదగు శుభకార్యమేదైన [illegible] వించు, చేసెదను" అని వినయంగా పలికెను.




తొండమానునికి దర్శనమిచ్చు శ్రీనివాసుడు

తొండమానురాజు మాటలు విని శ్రీనివాసుడు [illegible]

యన్నయగు ఆకాశరాజు బ్రహ్మాదానము [illegible]

గావించినాడు. కాని నేను నివసించుటకు ప్రస్తుతము గృహము లేదు. కనుక ఆ లోటు నీవు తీర్చవలెను. నేను నివసించుట కొరకు చక్కని ఆలయము కట్టించి పుణ్యము కట్టుకొనుము. నీకు శాశ్వతమగు కీర్తిప్రతిష్ఠ లభించగలవు" అనెను.

శ్రీనివాసుని మాటలు విని తొండమానుడు ఎంతో ఆనందించి "స్వామి! తమరు యెచ్చట నివసించ గోరుచున్నారో తెల్పుడు. తమ ఆజ్ఞ ప్రకారము ఆలయ నిర్మాణము గావించెదను" అని చెప్పగా, శ్రీనివాసుడు ఆనందించి, శేషాద్రిపై వరాహస్వామి తనకు యిచ్చిన స్థలములో కట్టించమని పలికెను.

శ్రీనివాసుడి ఆజ్ఞానుసారము తొండమానుడు శేషాద్రిపై ఆలయము నిర్మించుటకై వెంటనే పనివారిని, పరికరములను తెప్పించెను. స్వల్పకాలములోనే శ్రీనివాసుడు నివసించుటకు 'ఆనంద నిలయ' మను చక్కని ఆలయమును, గోపుర ప్రాకార మంటపములు, కొండపై కెక్కుటకు, దిగుటకు తగినట్లు మెట్లు మొదలగు వానిని కట్టించినాడు. పూలబావిని మరింత చక్కగా తయారు చేయించినాడు. తొండమాను రాజు కట్టించిన ఆలయాదులలో శేషాద్రి రెండవ వైకుంఠమువలె శోభించు చుండెను.

శ్రీనివాసుడు పద్మావతీ దేవితో ఆరు మాసములు ఆనందముగా అగస్త్యాశ్రమమునందు గడిపెను. అప్పటికి తొండమానురాజు శేషాచలముపై తనకు ఆలయాదులు కట్టించినట్లు తెలిసికొని యెంతో సంతోషించెను. బ్రహ్మాది

దేవతలను, మహామునులను పిలిపించి 'ఆనంద నిలయ' ప్రవేశమునకు ముహూర్తము పెట్టించెను.

## పద్మావతీ శ్రీనివాసులు ఆనంద నిలయములో ప్రవేశించుట

ఆ శుభ ముహూర్తమున సకల లోకములోని వారు [illegible] నారు. పద్మావతీ శ్రీనివాసులను అత్యంత రమణీయముగ అలంకరించి మంగళ వాద్యములు మ్రోగుచుండ, వేదమూర్తులగు బ్రాహ్మణోత్తములు మంత్రములు చదువుచుండగా, మహర్షులు ఆశీర్వదించుచుండ, దేవతలు పుష్పవర్షము కురిపించు చుండ ఆనంద నిలయములో ప్రవేశ పెట్టినారు. ఆ వేడుకను చూచి బ్రహ్మాది దేవతలు యెంతో ఆనందించినారు. అప్సరసలు ఆనంద పరవశులై నాట్యము చేసి అందరినీ ఆనందింప జేసినారు. మహర్షులు, భక్తులు శ్రీనివాస దేవుని అనేక విధముల స్తుతించినారు.

పిమ్మట బ్రహ్మదేవుడు శ్రీనివాసుని చూచి "దేవ దేవా! జగన్నాథా! నాకు ఒక కోరిక గలదు. అది యేమనగా- నీ నివాస స్థానమగు ఈ దేవాలయము నకు వచ్చి నిన్ను ఎవరు దర్శింతురో వారి సకల పాపములు నశింపజేయునట్లు చేయుము" అనగా, శ్రీనివాసుడు చిరునవ్వు నవ్వి "పితామహా! నీవు కోరినట్లే చేయగలను" అని వరమిచ్చెను.

తదుపరి బ్రహ్మదేవుడు శ్రీనివాసుని చూచి "శ్రీ శేషాచలేశా! శ్రీనివాసదేవా! నేను నీ సన్నిధిని రెండు అఖండ జ్యోతులు వెలిగింతును. ఆ జ్యోతులు లోక కళ్యాణార్థము నీ సన్నిధిని సదా వెలుగుచుండవలెను. కలియుగాంతము వరకు నీవు ఈ వేంకటాచలముపై నివసించి భక్తులను రక్షించుచుండవలెను. నిన్ను దర్శించు భక్తులకు ఇహపర సుఖములొసగవలెను" అని ప్రార్థించగా, శ్రీనివాసుడు ఆనందించి "అట్లే కాగలద"ని పలికెను.

అంతట బ్రహ్మదేవుడు శ్రీనివాసుడి సన్నిధిన రెండు అఖండ జ్యోతులు వెలిగించెను. ఆ జ్యోతులు నేటికినీ శ్రీ వేంకటేశ్వర స్వామి సన్నిధిన వెలుగుచున్నవి.

తదనంతరము బ్రహ్మదేవుడు విశ్వకర్మను పిలిపించి ఉత్సవమునకు కావలసిన రథములు, వాహనములు, ఛత్రచామరాదులు తయారు చేయించి, సకల లోకవాసులను పిలిపించి, ఒక శుభముహూర్తమున శ్రీనివాస దేవునకు మహా వైభవముగా బ్రహ్మోత్సవము చేసెను. సకల లోకవాసులు ఆ బ్రహ్మోత్సవములను చూచి పరమానంద మంది యథాశక్తి స్వామికి కానుకలు సమర్పించి తమ తమ నివాస స్థానముల కేగిరి.

శ్రీనివాసుడు తనకు చక్కని ఆలయము కట్టించిన తొండమాను రాజును, మహా వైభవముగా ఉత్సవము జరిపించిన బ్రహ్మదేవుని మిగుల కొనియాడి, వారి కోరికలు తీర్చెదెనని వాగ్దానమిచ్చి పంపించెను.

మానమయిన సంగతి మరియొకటి కలదా? ఏమైననేమి, నారాయణుడు వచ్చి నన్ను బ్రతిమాలినంత వరకు నా పట్టుదల విడువను. నన్ను విడిచి ఉండి ఆయన మాత్ర మేమి సుఖపడుచున్నాడు? పుట్టలో దాగి యుండి కష్టపడుచుండలేదా?" అని పలికెను.

ఆమె మాటలువిని నారదుడు నవ్వి "తల్లీ! నీవెంత అమాయకురాలవు. శ్రీహరికిప్పుడు ఏ కష్టమూ లేదు. ఆయన పెండ్లి చేసికొని కొత్త భార్యతో కులుకుతూ హాయిగా కాలము గడుపుతున్నాడు. నీ కర్మయే యిట్లున్నది" అని చెప్పినాడు.

నారదుడు చెప్పిన మాటలు విని లక్ష్మీదేవి కంపించిపోయినది. ఆమె గుండె జల్లుమన్నది. కండ్లు నీటితో నిండినవి. నోట మాట రాలేదు. దుఃఖము పొంగి వచ్చినది. ఏనాటికైనను భర్త తన వద్దకు వచ్చి గౌరవంగా తీసుకొని వెళ్ళగలరని కొండంత ఆశతో వున్న ఆమె ఆశలు అడియాసలైనవి. నారదుని చూచి "నాయనా! నీవు చెప్పిన సంగతి నిజమేనా? లేక హాస్యమున కిట్లు అనుచున్నావా?" అని ఆతృతగా అడిగెను.

అది విని నారదుడు "తల్లీ! నీ వద్ద అబద్ధము చెప్పుదునా? ఇది హాస్యమాడే సమయమా? నీ కాపురమునకు ముప్పు కలుగుచున్న సమయంలో నేను పరిహాసమాడునంత అవివేకినా? నేను చెప్పిన విషయము యదార్థము గాని, అసత్యము కాదు" అనెను.

"అట్లయిన నాకు వారిని చూపించెదవా?" అని లక్ష్మీదేవి అడుగగా నారదుడు "తప్పక చూపించెదను. నాతో రమ్మ" అని ఆమెను వెంటబెట్టుకొని శేషాద్రికి పోయెను.

శ్రీనివాసుడు అప్పుడప్పుడు లక్ష్మినిగూర్చి చింతించుచుండెను. లక్ష్మి ఎడబాటును సహించలేకుండెను. కాని రామావతారములో వేదవతికిచ్చిన వరము ననుసరించి పద్మావతిగా పుట్టిన వేదవతితో సంసారం చేయక తప్పదు. అయినను లక్ష్మి నెడబాసి ఉండజాలడు. ఆమె నెట్లయినను తన వద్దకు రప్పించుకొనవలెనని ఆలోచించుచున్నాడు కాని తగిన ఉపాయం తోచుట లేదు.

అయిన నీవే యిట్టి అధర్మానికి, అన్యాయానికి పూనుకొన్న యిక లోకంలో ధర్మాన్ని కాపాడేవారెవరు?" అని కన్నీరు మున్నీరుగా విడుస్తూ అడిగింది. శ్రీనివాసుడు ఏమి చెప్పుటకు తోచక మౌనముగా ఊరుకొన్నాడు.

అంతట లక్ష్మీదేవి పద్మావతిని చూచి "ఎవతెవే నీవు? నా నాథుని ప్రక్కజేరి తగుదునమ్మాయని కులుకుచున్నావు?" అని అడుగగా. పద్మావతీదేవి కోపించి" అగ్నిసాక్షిగ పెండ్లాడిన నన్నే నీవెరని అడుగుచున్నావు. నీవెవతవు? ఇంతకాలము అవసరము లేకపోయిన భర్త యిప్పుడు కావలసి వచ్చినాడా? సిగ్గులేక నా భర్తను నిందించుచున్నావా? వచ్చిన దారిని మర్యాదగా తిరిగిపో"అని గద్దించి పలికెను.

పద్మావతి మాటలు విని లక్ష్మి ముఖం చిన్నబుచ్చుకొని శ్రీనివాసుని చూచి "నాథా! నిజం చెప్పరేమి? నేను మీ భార్యను కానా? ఈమె ముందు నన్ను అవమానింతురా-సత్యము చెప్పుడు" అని పద్మావతి దేవి అడిగినది.

ఇట్లు శ్రీనివాసుని అడుగుచు లక్ష్మి పద్మావతులు ఒకరినొకరు దూషించుకొనుచు. శపించుకొనుచు. చేతులు త్రిప్పుచు, మూతులు పొడుచుకొనుచు "నా నాథుడు!" "నా నాథుడు!" అని శ్రీనివాసుని చెరియొక తెరక్కపట్టి లాగుచున్నారు. ఇద్దరి భార్యల మధ్య యిరుకుకొని శ్రీనివాసుడు కొంతసేపు మౌనముగా వుండి తరువాత లక్ష్మిని చూచి యిట్లు చెప్పినాడు.

## పద్మావతీదేవి పూర్వ చరిత్ర

"ప్రాణేశ్వరీ! నీకొక రహస్యమును తెల్పుచున్నాను. కోపమును ఆవేశమును విడనాడి. శ్రద్ధగా వినుము. ప్రియులారా! పద్మావతీ! నీవు కూడ

శ్రద్ధగా వినుము. నేను చెప్పిన విషయములు పూర్తిగా విన్న తరువాత మీరు కొట్టుకొందురో, తిట్టుకొందురో, సఖ్యతగా ఉందురో మీరే నిశ్చయించుకొని మీకు తోచినట్లు చేయుడు. నేను చెప్పబోవు విషయములు దివ్యజ్ఞానము కలిగిన గాని గ్రహించజాలరు. కావున ముందుగా మీకు దివ్య జ్ఞానమును ప్రసాదించు చున్నాను. ఇక శ్రద్దగా వినుడు" అని శ్రీనివాసుడు యిట్లు చెప్పెను.

"లక్ష్మి! త్రేతాయుగములో నేను రామావతారమున నున్న సమయ మున నీవు సీతవై యుంటివి. అప్పుడు నేను తండ్రి ఆజ్ఞ ననుసరించి నిన్నూ లక్ష్మణుని వెంటబెట్టుకుని అరణ్యవాసంనకు పోయితిని, అరణ్యములో మన మొక పర్ణశాల నిర్మించుకొని కాపురము చేయుచుండగా ఒక మాయలేడి కనబడి నది. దానిని పట్టితేవలెనని పోయితిని. అది ఎంత ప్రయత్నించినను దొరకక మాయచేసి పారిపోవుచున్నందున బాణం విడిచితిని. అప్పుడది చచ్చుచు నేను అరచినట్లు "హా సీతా! హా లక్ష్మణా!" అని అరచెను. ఆ యరపువిని నీవు నాకేదో ఆపద కలిగిందని తలచి లక్ష్మణుని పంపితిని, అదే సమయమని దుర్మార్గుడైన రావణుడు నిన్ను యెత్తుకొని పోవుటకు మునివేషంతో వచ్చెను. అప్పుడు మహానుభావుడైన అగ్నిహోత్రుడు నిన్ను తనయందు దాచియుంచి తనలో అంతకుముందు నన్ను పెండ్లాడగోరి దగ్ధమైన వేదవతిని రావణా సురు నకు నిజమైన సీతయని నమ్మించి పట్టుబడ జేసెను. ఆ వేదవతిని రావణుడు సీతయని చెరబట్టెను గదా! నేను వానర సైన్యముతో సముద్రం దాటి లంక ఏగి రావణుని వధించి సీత రూపమున నున్న వేదవతిని కాపాడితిని, లోకాప వాదము వచ్చునని ఆ సీత రూపమును అగ్నిలో ప్రవేశించమని ఆజ్ఞాపించితిని. అప్పుడు అగ్నిలో నీవునూ, వేదవతియు యిద్దరూ వుండగా నేను ఆశ్చర్యపడి చూచు చుంటిని అప్పుడు అగ్నిహోత్రుడు నిజవృత్తాంతము నెరిగించెను గదా! అది విని నీవు నాతో ఏమంటివో జ్ఞప్తికి తెచ్చుకొనుము.

"నాథా! ఈ వేదవతి నా కొరకై రావణాసురుని చెఱ అనుభవించి నాకు సహాయం చేసినది, కావున ఈమెను కూడ వివాహ మాడుడు" అని కోరితివి. అప్పుడు నేను నీతో "సీతా! నేను ఏకపత్నీ వ్రతుడను కలియుగము నందీమెను పెండ్లాడెదను" అని నీకు చెప్పి నిన్ను తృప్తి పరిచితిని గదా! ఆనాటి వేదవతియే యిప్పుడీ పద్మావతిగా అవతరించినది. ఇప్పుడు నీకా వృత్తాంత మంతయు చక్కగా తెలిసినది. ఆడినమాట తప్పకుండ నా ధర్మము నేను నిర్వర్తించితిని. ఇందు నా తప్పేమున్నదో చెప్పుము" అని యడిగెను.

భర్త చెప్పిన మాటలు విని లక్ష్మీదేవి శాంతించినది. పద్మావతీదేవి సిగ్గుతో తలవంచుకొన్నది. భగవానుడిచ్చిన దివ్యదృష్టితో తమ పూర్వజన్మ వృత్తాంతములు తెలిసికొని ఆనందించిరి. లక్ష్మీదేవి పద్మావతిని కౌగలించుకొని "చెల్లెలా! అజ్ఞాన వశమున నిన్ను పరస్త్రీవని భావించి నిందించితిని, అన్యథా భావించకుము" అనగా, పద్మావతి నవ్వి "అక్కా! నిన్ను యెదిరించి మాట్లాడినందుకు నీవు నన్ను క్షమించవలెను" అని కోరెను.

సవతు లిద్దరి మధ్య సఖ్యత కలిగినందుకు శ్రీనివాసుడు ఎంతో ఆనందించెను. లక్ష్మీదేవిని కౌగలించుకొని తన వక్షస్థలమున చేర్చుకొనెను. భార్య లిద్దరితో కలిసి భగవంతుడు ఆనందించుచు భక్తులను కాపాడసాగినాడు. కలియుగ ప్రత్యక్షదైవమని, పిలిచిన పలికేడి దేవుడని ప్రసిద్ధి పొందినాడు.

ఆ శ్రీనివాసుడే నేడు శ్రీ వెంకటేశ్వరుడు. ఏడుకొండలవాడు. బాలాజీ, తిరుమలేశుడు మొదలగు అనేక పేర్లతో పిలువబడుచున్నాడు. భక్తుల పాలిటి కల్పవృక్షమై ప్రకాశించు చున్నాడు.

## శంఖణుని కథ

పూర్వము శంఖణుడను రాజు ఉండెను. అతడు కాంభోజ దేశమును పాలించెను. అతడు ధర్మము తప్పక రాజ్యమును పాలిస్తూ మంచిపేరు పొందెను.

శత్రురాజులు కొందరు శంఖణుని పేరు ప్రతిష్ఠలు చూచి అసూయ పడుతున్నారు. అందరును కలసి శంఖణుని మీదికి దండెత్తి వచ్చిరి. శంఖణుడు వారి నెదుర్కొని పోరాడెను. కాని తనసైనికుల కంటె పదింతలుగ నున్న శత్రు సైనికులతో ఎక్కువ కాలం పోరాడలేక పోయెను. తుదకు శంఖణుడు ఓడిపోయి రాజ్యమును విడిచి భార్యతో అరణ్యంనకు పారిపోయెను.

తరువాత శంఖణుడు సతీసమేతంగ రామేశ్వరము మొదలగు పుణ్య క్షేత్రంలు దర్శించి తుదకు అలివేలు మంగాపురం చేరెను. అచ్చటి పద్మ సరోవర తీర్థంలో నిత్యము స్నానం చేయుచూ తనకు కలిగిన దుస్థితికి విచారిస్తుండెను.

అప్పుడొకనాడు ఆకాశవాణి శంఖణు నుద్దేశించి "మహారాజా! విచారించకుము; శ్రీ వేంకటాచలమునకు వెళ్ళి అచ్చటి పుష్కరిణిలో, స్నానంచేసి శ్రీ వేంకటేశ్వరుని పూజింపుము. నీకు రాజ్యప్రాప్తి కలుగును" అని చెప్పెను.

ఆకాశవాణి మాటలు విని శంఖణుడు సతీసమేతంగా వేంకటాచలమున కేగి, పుష్కరిణిలో స్నానమాచరించి శ్రీవేంకటేశ్వరుని తులసితో పూజించెను. స్వామికి అతనిపై అనుగ్రహం కలిగి "రాజా! నీకు త్వరలో రాజ్య ప్రాప్తి యగును. దుఃపడకుము" అని చెప్పెను.

శంఖణుడు అచ్చటినుండి బయలుదేరి కొన్నాళ్ళకు తన రాజ్యంచేరెను. దైవంపై భారంవేసి శత్రువులతో పోరాడి రాజ్యంనుండి తరిమివేసెను. తిరిగి సింహాసన మధిష్టించి రాజ్యపాలన చేసి పేరు పొందెను.

# వసువు చరిత్ర

శ్రీ వేంకటాచలమునందు వసువు అను బోయవాడు నివసించు చుండెను. వాని భార్య చిత్రావతి. వారు ఆ కొండపై అన్యోన్యానురాగములు కలిగి హాయిగా కాపురం చేయుచుండిరి.

వసువు జంతువులను వేటాడు కిరాతుడైనను గొప్పదైవభక్తిగలవాడు. అతడు ప్రతిదినం ఆ కొండపై లభించు వెదురు బియ్యము తెచ్చి భార్యకిచ్చి వండించును. దానిలో పుట్టతేనె కలిపి తాము నివసించు చెట్టు క్రిందనున్న రాతి బొమ్మను శ్రీ వేంకటేశ్వరునిగా భావించి, పూజించి, నైవేద్యంపెట్టి భార్యకు పెట్టి తాను తినుచుండెను.

ఇట్లు జరుగుచుండగా చిత్రవతి గర్భవతి యయ్యెను. ఒక చక్కని కుమారుని కనెను. వానికి సువీరుడు అను పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచి పెద్ద గావించిరి. క్రమంగా సువీరుడు పండ్రెండేండ్ల వాడయ్యెను.

ఒకనాడు వసువు తేనె తెచ్చుటకు అడవికి పోయెను. చిత్రావతి తేనె తెచ్చుట లోపల అన్నం చెట్టు క్రింద వున్న దేవునకు అరగింపుచేసి తాను భుజించెను.

కొంతసేపటికి వసువు యింటికి వచ్చెను. తేనెలేకుండ స్వామికి అన్నం పెట్టిన సంగతి తెలుసుకొని కొడుకుపై పట్టరాని కోపం పొందెను. కత్తి పట్టి కొడుకును చంపబోవుచుండగా "ఓయీ, శాంతించుము. నీ వలెనే నీ పుత్రుడు కూడా నాకు పరమ భక్తుడు. తేనె లేనంత మాత్రమున భక్తికి లోటు కలుగదు." అని వేంకటేశ్వరస్వామి పలికి వారి కుటుంబమునకు మోక్షమిచ్చెను.

భక్తులను కాపాడుటలో శ్రీ వేంకటేశ్వరుడు తనకు తానే సాటియని పించుకొనుచుండెను.

## కుమ్మరదాసు

వేంకటాద్రికి ఆమడ దూరమున ఒక పల్లె కలదు అందు భీముడు అను నొక కుమ్మరి కలడు. అతని భార్యపేరు తమాలిని. ఆ దంపతులు శ్రీ వేంకటేశ్వరుని పరమభక్తులు.

భీముడు కుండలు చేయు మన్ను త్రొక్కుచున్నప్పుడు, సారె త్రిప్పునప్పుడును, కుండలు కాల్చునప్పుడును, యెల్లవేళలందు శ్రీ వేంకటేశ్వర నామస్మరణ చేయుచుండెను. అతని భార్య యగు తమాలిని కూడ ఎల్లప్పుడు శ్రీ వేంకటేశ్వర నామస్మరణ చేయుచు తనకు ఉన్నంతలో బీదలకు కొంత పెట్టుచు భర్తతో ఆనందంగా కాలం గడుపు చుండెను.

కుమ్మరదాసు తనయింటిలో మట్టితో సింహాసనంచేసి, మట్టితోనే వేంకటేశ్వర విగ్రహం తయారుచేసి, సింహాసన మందుంచి నిత్యం పూజించు చుండెను. ఒక్కొక్కప్పుడు కుండలు చేయుచు హరినామస్మరణలో మునిగి మైమరచి పని మరచిపోవుచుండెను. కాని దైవానుగ్రహంవలన అతని పనులకు ఎట్టి భంగము కలుగకుండెను.

వేంకటాలచలమున శ్రీ వేంకటేశ్వరుని సేవించుచున్న తొండమానునితో స్వామి కుమ్మరదాసు దంపతుల భక్తిని గూర్చి చెప్పగా తొండమాను వారిని చూడవలెనని పరుగు పరుగున ఆ పల్లెకు పోయెను. పరుగు వలన మిక్కిలి అలసి కుమ్మరదాసు ఇంటి వాకిట పడి మూర్ఛపోయెను. కుమ్మరిదాసు మట్టి పాత్రతో నీరు తెచ్చి తొండమానుని ముఖంపై జల్లెను. కొంతసేపటికి తొండమానుడు మూర్ఛనుండి తేరుకుని లేచెను. అట్టి సమయమున శ్రీ వేంకటేశ్వర స్వామి అచ్చట ప్రత్యక్షమయ్యెను. స్వామిని చూచి వారందరూ ఆనంద పరవశులైరి.

తమాలిని స్వామికిమట్టి పీఠంవేసి కూర్చుండబెట్టి, మట్టిచెంబుతో మంచి నీరు యిచ్చి, మట్టి పాత్రలో భోజనం వుంచి "స్వామి! నిరుపేదలము. మాకున్న యిదే! క్షమించి విందారగింపుడు" అని ప్రార్థించెను.

శ్రీ వేంకటేశ్వరస్వామి ఆనందించి, తృప్తితో ఆ పదార్థములు భుజించెను. ఇంతలో దైవానుగ్రహంవలన దేవవిమానము అచ్చటికి వచ్చెను. స్వామి కుమ్మరిదాసు దంపతులను అందు కూర్చుండజేసి స్వర్గమునకు పంపెను.

చూచితిరా శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తరక్షణము.

తిరుమల – తిరుపతి శ్రీ వేంకటేశ్వరలీలలు

స ం పూ ర్ణ ము

# శ్రీ వేంకటేశ మంగళా శాసనము

శ్రీ యః కాంతాయ కల్యాణ నిధయే నిధయే ర్థినామ్ ।
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥ ౧

లక్ష్మీ సవిభ్రమా లోక సుభ్రూ విభ్రమ చక్షుసే ।
చక్షుసే సర్వ లోకానాం వేంకటేశాయ మంగళమ్ ॥ ౨

శ్రీ వేంకటాద్రి శృంగాగ్ర మంగళా భరణాం ఘ్రయే ।
మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥ ౩

సర్వావయవ సౌందర్య సంపదా సర్వ చేతసామ్ ।
సదా సమ్మోహనా యాస్తు వేంకటేశాయ మంగళమ్ ॥ ౪

నిత్యాయ నిరవద్యాయ సత్యానంద చిదాత్మనే ।
సర్వాంత రాత్మనే శ్రీ మద్వేంకటేశాయ మంగళమ్ ॥ ౫

స్వతస్సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్ ॥ ౬

పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥ ౭

అకాలతత్త్వ మశ్రాంత మాత్మనా మనుపశ్యతామ్ ।
అతృప్త్యమృత రూపాయ వేంకటేశాయ మంగళమ్ ॥ ౮

ప్రాయస్స్వ చరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా ।
కృపయా ఽ దిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥ ౯

దయా ఽ మృత తరంగిణ్యా స్తరంగై రివ శీతలైః ।
అపాంగై స్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్ ॥ ౧౦

స్రగ్భూషాంబర హేతీనాం సుషమా ఽ వహ మూర్తయే ।
సర్వార్తి శమనాయాస్తు వేంకటేశాయ మంగళమ్ ॥ ౧౧

శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామి పుష్కరిణీ తటే ।
రమయారమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥ ౧౨

శ్రీ మత్సుంధర జా మాత్రముని మానస వాసినే ।
సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥ ౧౩

మంగళా శాసన పరైర్మద చార్యపు రోగమైః ।
సర్వైశ్చ పూర్వైరా చార్యైస్సత్కృతాయాఽస్తు మంగళమ్ ॥ ౧౪

శ్రీ వేంకటేశ మంగళా శాసనం సమాప్తమ్.